

తప్పక
చూడండి
గౌతమి ప్రొడక్షన్స్ వారి
మహామంత్రి
తిమ్మరుసు
దర్శకత్వం: కె. కామేశ్వరరావు బి.ఎ.,
రచన: పింగళి .... సంగీతం: పెండ్యాల
ఆంధ్ర
సీడెడ్
నైజాం
డిస్ట్రిబ్యూటర్స్: గౌతమి పిక్చర్స్.... భాస్కర్ పిక్చర్స్.... వాణీ ఫిలిమ్స్
CHITRALEKHA

# ఉత్తరాలు

## చిత్రవ్యక్తులు

శ్రీ సుకుమార్ యీవారం (20—7—62) "చిత్రవ్యక్తులు" అనే శీర్షికలో తెలుగు నూతన నటీమణి "శారద" ను పరిచయం చేసినందులకు నా అభివందనములు. ఇకమీదట శ్రీ సుకుమార్ నూతన నటీనటుల గురించి వ్రాయునప్పుడు వారి అడ్రసులలో సహా వ్రాయగలరని నే వాశిస్తున్నాను.

బి. రమేష్ (చొప్పదండి)

* * *

శారదగారి పరిచయముతోబాటు వారి అడ్రసు గూడ ప్రచురించినయెడల చాలా బాగుండును. ఇక ముందు "చిత్ర (పరిచయ) వ్యక్తుల" యొక్క చిరునామాలను గూడ తెలుపుదురని ప్రార్థన.

పి. వి. కె. మూర్తి (నందలూరు)

**మీ సూచన పాటించలేమేమో!**

* * *

'చిత్రవ్యక్తులు' క్రొత్త శీర్షికలో నూతన నటి 'శారద' ను పరిచయం చేశారు. చాలా బాగుంది. కాని ఒక్క సందేహం! శారద 'రక్త కన్నీరు' లో నటించిన దన్నారు. ఏలూరులో 'నాగభూషణం' జట్టు వేసిన నాటకానికి మేము వెళ్లాము. కాని శారద మాకు అందులో కన్పించలేదు. మద్రాసులో వేరే 'రక్తకన్నీరు' నాటకం వేశారో, లేక మేమే పొరబడ్డామో మా కర్థం కావటంలేదు. ఏపాత్ర వేశారో తెలిపి మా సంశయాన్ని తీర్చవలసినదిగా కోరుచున్నాము. 'చిత్రవ్యక్తులు' అన్న శీర్షిక ప్రవేశపెట్టినందుకు చాలా సంతోషముగా ఉన్నది.

కుమారి ఆశాలత కొండేపూడి (తణుకు)

* * *

నూతన నటి శారదను గురించి వేస్తూ ఆమె 1945 వ పుట్టినట్లు వ్రాశారు. అంటే యిప్పుడామెకు 17 వ సంవత్సర మన్నమాట.

రామచంద్రయ్య (వెల్లూరు)

**ముఖచిత్రం**

నటి శారదను పత్రిక ద్వారా పరిచయం చేసిన దానికి మీకు నా అభివాదములు. చిన్న వయస్సులోనే ఈమె ఇంత కీర్తి తెచ్చుకొనినదంటే పోను పోను పెద్ద నటీమణి అగునని నా అభిప్రాయము.

మామిడాల కృష్ణకుమార్ (బెంగుళూరు)

* * *

నూతన తార జయంతి ముఖచిత్రం ఎన్నిసార్లు చూచినా తనివితీరడంలేదు. నా అభిమాన నటిని ముఖచిత్రంగా వేసినందుకు అభినందనములు.

గానిగరాజ రాంబాబు (గుంతకల్లు)

**కథలు**

ఆదివిష్ణుగారి 'సారధి' కథ సహజసిద్ధంగా ఉన్నది. 'సారధి' పాత్రను సృష్టించుటలో రచయిత పద్ధతియే పద్ధతి!

శ్రీమతి ప్రసన్నసిన్హా (బెనారస్)

"మొదటి ఓటమి" మారుతి గారి కథ నన్ను చాల బాగ ఆకర్షించింది. వివాహమైన వనజ కాలేజీలో చదువుకోడానికి కారణము తెలుపలేదు కథలో రచయిత (త్రి) గారు.

ఎన్. హెచ్. ప్రసాదశర్మ (హైదరాబాద్)

* * *

"మొదటి ఓటమి" కథ మొదటి నుంచి, చివరి వరకు మంచి చురుకుగా నడిచింది. కాని ఒక్క చిన్న సందేహం. ఎం. ఎ. ఫస్టులో పాసైన 'కుశాలరావు' కి తన ప్రక్క యింటిలోనే యుంటూ ఆన క్లాసులోనే చదువుకొంటున్న 'వనజ' కు పెండ్లి అయినదీ లేనిదీ తెలియకపోవడం కొంచెం అసహజంగానే కనిపిస్తుంది. ఎందుచేతనంటే భారత స్త్రీ ముఖ్యంగా ఆంధ్ర వనిత వివాహితో, అవివాహితో తెలుసుకోవడం ఏమంత బ్రహ్మవిద్య కాదు గదా! అయినా కథలో మట్టుకు ఎక్కడా పటుత్వం తగ్గలేదు.

శ్రీ రామదాసు భాస్కరరావు (బిలాసపూరు)

* * *

"మొదటి వోటమి" కథ చాలా బాగుంది. ఆ యేడే కాలేజీలో చేరిన మాధవరావు అని వ్రాశారు. ఆ సంవత్సరమే కాలేజీలో చేరిన విద్యార్థి 'ఫస్టియర్' లో ఉంటాడు గాని "థర్డియర్" లో ఉండడని రచయితగారికి తెలియదా?

వీరంరెడ్డి సూరిబాబు (వైజాగ్)

**గ్రాడ్యుయేట్ కోర్సులో మొదటి సంవత్సరాన్ని థర్డ్ ఇయర్ అంటారని వినికిడి.**

* * *

రంగధామ్ గారు వ్రాసిన "లేడీస్ క్లబ్" కథలో కమలలాగా అపార్థం చేసుకొనే స్త్రీలు చాలామంది ఉన్నారు. వారిని పెళ్లి చేసుకోటం పొరపాటయితే చాలామంది యువకులు పొరపాటు చేస్తున్నారన్న మాట.

ఎన్. స్వర్ణకుమార్ (తెనాలి)

* * *

20—7—62 పత్రికలో శ్రీధర్ (విశాఖ) గారు 'గుండు ధ్వయం' మీద విమర్శ వ్రాస్తూ 'తిరుపతిలో అసలు అద్దములు అమర్చబడిన కూల్ డ్రింక్ షాపులేదు అన్నారు. వారు పొరబడ్డారను కొంటాను. కొండ దిగువ భాగమునకు పోవు సందులో మొదటనే ఒక డ్రింకులషాపు ఉన్నది. దానిలో లోపల అద్దములు అమర్చబడి ఉన్నాయి. నేను విన్నదే చూశాను.

సంకురాత్రి శ్రీనివాసరావు (తిరుపతి)

**విమర్శలు**

విమర్శలు సరిగా వ్రాయటంలేదు. అన్ని సినిమాలు బాగానే ఉన్నవని వ్రాస్తున్నారు. సరిగా విమర్శించమని కోరుచున్నాను.

కాట్రపాటి దుర్గాకుమారి (బిలాయ్) ★

ఆంధ్రసచిత్ర వారపత్రికలో ప్రకటనలు
మీ వ్యాపారాభివృద్ధికి తోడ్పడుతాయి

# స్లోన్స్ బామ్ వాడి నొప్పిని వెంటనే పోగొట్టుకోండి




స్నాయువుల బెణుకులు, మెడ పట్టులు మరియు వీపు నొప్పులు, కీళ్ల ఉబ్బులు నాడీవ్యాధి మరియు నడుమునొప్పి మొదలగు నొప్పులకు నొప్పిగా ఉన్నచోట్లల్లా కొంచెము స్లోన్స్ బామ్ రాయండి. తక్షణమే దాని ఉపశమనము కూర్చే వేడి లోపలికి వ్యాపించి నొప్పిగా ఉన్న చోటుకు శుభ్రపరచే రక్తము క్రొత్తగా ప్రవహించుటలో సహకరించును. వెంటనే ఉపశమనము కలిగించే ఒక స్లోన్స్ బామ్ సీసాను ఎల్లప్పుడూ యింట్లో ఉంచుకోండి.

## వాతరోగము * బెణుకులు * స్నాయువుల నొప్పులకు

వార్నర్-లేంబర్ట్ ఫార్మస్యూటికల్ కంపెనీ (పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఏ.లో స్థాపింపబడినది)

Our Quality Blends to Satisfy Distinguished people of different tastes.

Fresh, Fragrant & Delicious — ఆంధ్రా కాఫీ పొడరు — ANDHRA Coffee — Quality is our Motto — 400 GRAMS — GOLDEN BLEND

Fresh, Fragrant & Delicious — ఆంధ్రా కాఫీ పొడరు — ANDHRA Coffee — Quality is our Motto — 400 GRAMS — POPULAR BLEND

Fresh, Fragrant & Delicious — ANDHRA Coffee — Quality is our Motto — 400 GRAMS — HOTEL BLEND

ANDHRA Coffee — 400 GRAMS — RED LABEL COFFEE

# ANDHRA COFFEE INDUSTRY, H.O. BRODIPET-GUNTUR-2

Branches:

| GUNTUR<br>2ND LINE BRODIPET | GUNTUR<br>PATNAM BAZAAR | BAPATLA<br>CAR STREET |
|---|---|---|
| SATTENAPALLI<br>MADDIVARI STREET | NARASAROPET<br>GANDHI CHOUK, MAIN ROAD | HYDERABAD<br>1-8-44/13 CHIKKADPALLI MAIN ROAD |

# ఆంధ్రసచిత్రవార పత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

*

శుక్రవారం : 3—8—62
సంపుటము : 54 సంచిక : 48
శుభ॥ సం॥ శ్రావణ మాసం॥ శుద్ధ తదియ

స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకులు :
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకులు :
శివలెంక రాధాకృష్ణ

*

విడిప్రతి : 25 న. పై
సంవత్సర చందా : 13-0-0 రు.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీధి, మద్రాసు-1






ముఖచిత్రం: శ్రీ బి. వి. సత్యమూర్తి

## మనలోమాట

హైదరాబాద్‌లో జులై 22 తేదీన జరిగిన బాపూ బొమ్మల ప్రదర్శనకు సంబంధించిన 'వార్తా చిత్రాలు' సకాలంలో అందనందు వల్ల ప్రచురించ లేక పోతున్నాము. పై వారం సంచికలో ప్రచురించ గలమని ఆశిస్తున్నాము!

* * *

'అమ్మాయిల మధ్యలో ఆనంద రావు' కథ చదవగా ఆడ 'లెక్చరర్' లను 'మేడమ్' అంటారని తెలిసి ఆశ్చర్యపడ్డాము. పెద్ద డిక్షనరీ ఏదైనాచూస్తే ఈ మాట సంబోధనగా తప్ప, వేరేవిధంగా వాడినట్లయితే చిత్రమయిన అర్థం ఉందని తెలుస్తుంది! కాని, ఇంగ్లండ్‌లోనూ మగ (స్కూలు) టీచర్లను 'సార్' అంటారని తెలుస్తుంది.

* * *

ఈ వారం చిత్ర వ్యక్తులకు 'తృతీయ విఘ్నం' కలిగింది! పై వారం సంచికలో ప్రచురిస్తాము. శీర్షిక ఎలా తప్పిపోయిందో కూడా పై వారం చెప్తాము!

* * *

ముఖచిత్రంమీద ప్రత్యేకమైన వ్యాఖ్య అనవసరమనుకుంటాము!

## లోకంపోకడ



"మంత్రిగారికి జలుబుచేసి భారంగా ఉంది. కనక వారి ఉపన్యాసంలో ఉచ్చారణ దోషాలు వెతక్కండి! అవి కేవలం జలుబువల్ల దొర్లినవేగాని, వారికి తెలియకమాత్రం కాదు. ఈ విషయం వారు ముందుగా మీతో మనవి చెయ్యమన్నారు కాబట్టి చెబుతున్నా!!"

## విషయానుక్రమణిక


పింఛన్‌మంజూరు
చెయ్యటంలో కాలయాపన
జరగకుండా చర్యలు
తీసుకుంటామని ఆర్థిక
మంత్రి పింఛన్‌దారులకు
హామీయిచ్చారు
ప్రభుత్వ రధం


రండి చూద్దాం!
పరిమితయుద్ధానికైనా సరే
మేము తయార్
నిన్న


నదీ జలాల పంపిణీ
విషయం మాట్లాడుకుందాం. దయచెయ్యండి!
ఈవేళ


మనిద్దరం కలసిప్రయాణాం
చెయ్యలేం కనుక
పడవని పంచుకుందాం
సంత్ ఫతే సింగ్
తారాసింగ్
దళం
అకాలీ

# కథ కాని కథ

## అలవాటూ-పొరపాటూ

### (మొదటి బహుమతి)

వారంరోజుల క్రితం మా మిడిల్ స్కూల్ వార్షికోత్సవం జరిగింది. దానికి అధ్యక్షత వహించడానికి మా ఊరిలో పేరుపొందిన పెద్దమనిషిని ఆహ్వానించారు. ఆయన ఆలస్యంగా రావడం మూలాన సభ ఆలస్యంగా ప్రారంభమయింది. స్టేజిదగ్గర ఉన్న పిల్లలు ఎక్కువగా గోలచేస్తున్నారు. ప్రార్థన అయింది. హెడ్ మాస్టరుగారు వార్షిక నివేదిక సమర్పించుటకై లేచి నిలబడి "అధ్యక్షా!" అని, "ఒరేయ్, గొడవచేయకు!" అని ముందువరసలో ఉన్న పిల్లవాడిని అలవాటు చొప్పున అదలించారు. ప్రేక్షకులు అంతా పెద్ద పెట్టున నవ్వడం మొదలుపెట్టారు.

రామకృష్ణ (కాకినాడ)

* * *

## దండయాత్రలు

### (రెండవ బహుమతి)

యలమంచిలి పాకబడిలో ఐదవ తరగతి వరకే ఉంది. ఐదవ తరగతికి చెబుతున్న పాత పంతులుగారి స్థానంలో కొత్త పంతులుగారు వచ్చారు. ఆ రోజు క్లాసు పిల్లలంతా కొత్త మాష్టరు వచ్చారని సంతోష పడిపోతున్నారు. కుర్రవాళ్లు యెంత శ్రద్ధగా చదువుతున్నారో, వాళ్ళ తెలివితేటలు ఎలా వున్నాయో, కొత్త మాష్టరుకి తెలియదు కదా! వాళ్ళ చదువుసంధ్యల్ని, తెలివితేటల్ని పరీక్షించాలనుకున్నారు. చరిత్రలో ఏవేవో కొన్ని ప్రశ్నలు వేశారు. కొందరు చెప్పారు. మరి కొందరు చెప్ప లేదు. తరువాత పంతులుగారు ఒక కుర్రవాడి నుద్దేశించి "మన దేశంపై గజనీ మహమ్మద్ ఎన్నిసార్లు దండెత్తాడు?" అని అడిగారు. ఆ కుర్ర వాడు లేచి నిలబడి "పదిహేడు సార్లండి" అన్నాడు. "నువ్వుకూర్చో" అన్నారు పంతులుగారు. ఘోరీ మహమ్మద్ గురించి అడిగారు. ఇద్దరు కుర్రవాళ్ళు తెలియక మౌనం వహించారు. మూడవ కుర్రవాడు లేచి "నాకంటె నాలుగుసార్లు యెక్కువండి" అన్నాడు. కొత్త మాష్టరుకి ఇదేమీ అర్థం కాక "నీకంటె నాలుగుసార్లు ఎక్కువేమిటిరా?" అని అడిగారు. "అది కాదండి! మన దేశంపై గోరీ మహమ్మద్ యేడుసార్లు దండెత్తాడు. నేను ఈ క్లాసులో మూడుసార్లు దండెత్తాను. మరి, నాకంటే నాలుగుసార్లేగా యెక్కువ!" అన్నాడు. కొత్తమాష్టరు నవ్వాపుకోలేక పోయారు.

పి. రామారావు (యలమంచిలి)

* * *

## హరికథ భక్తుడు

### (రెండవ బహుమతి)

మా ఇంటిదగ్గర "శ్రీరామ నవమి" ఉత్సవాలు జరుగుచుండేవి. ఒకనాడు హరికథ జరిగినది. ప్రతి రోజు కార్యక్రమము పూర్తిఅయ్యాక ప్రసాదము పంచేవారు. ఆ రోజు చాలా ప్రొద్దుపోయింది. హరిదాసు కథ చెబుతూ మధ్యలో ఒకసారి "శ్రీమత్ రమారమణ గోవిందో! గోవింద" అన్నారు. వెంటనే నిద్రపోతున్న ఒక మనిషి పరుగుతీసి, హరిదాసువద్ద ప్రసాదముకోసం చెయ్యి జాపాడు. హరిదాసు అది చూచి "నాయనా! ఇంకా "సీతామ్మవారు అడవిలోనే ఉన్నారు!" అని అనగా అక్కడివారందరికి నవ్వు ఆగిందికాదు.

బి. స్వరూప్ కుమార్, (హైదరాబాద్)





# గోరంత గొప్ప

మా ఊరికి,—దేశంమీద,—పేరుంది. మాదొడ్డ పేరుంది : కొందరు పెద్దలు ఊరువిడిచి దేశం మీదికి పోయి పేరు తెచ్చారు.

కొందరు పెద్దలుకానివాళ్లు, ఎటూ పోని వాళ్లు, పోలేనివాళ్లు అక్కడే ఉండి, ఊరికి పెద్దరికం యిచ్చారు.

వాళ్లెవరు .... శ్రీమంతులు కారు,– జన్మంతా దరిద్రులు.

సిరిరా, మోకాలొడ్డిన—వివేకులు.

ఓ మిఠాయికొట్టు ఆసామీ,– ఓ యిడ్డెన్లమ్ముకునే, కోమటి,- ఓ దూదేకుల సాయిబూ, ఓ మునరి బసవన్న, ఓ అంగవస్త్రం బ్రాహ్మడూ, ఓ పడుచు వేశ్య,– ఓ కాపు కుర్రాడూ,- బొమ్మలు చేసుకునే ఓ ముచ్చి.

మిఠాయి కార్ఖానా ఆసామి—రామాంజయ్య.

గిరనామం పెట్టుకునేవాడు .... ఎప్పుడూ నవ్వుతూ ఉండేవాడు.

ఆలయంలో స్వామివారిని,– భక్తిశ్రద్ధలతో ముప్పొద్దులా సేవించడం మానకపోయినా .... మనుషులంటే మా భక్తి .... వాళ్లు తనకు ప్రత్యక్ష దైవాలుట. సరుకు,– మహా రుచిగా, శుచిగా, చేసేవాడు. దగ్గిరుండి చేయించేవాడు. చూలింతకు గాని, బాలెంతకు గాని, పడి లేచిన వాళ్లకు గాని,-పళ్లులేని వాళ్లకు గాని, రామాంజయ్య తొక్కుడు లడ్డూ అంటే ప్రాణం. ఉన్నవాళ్లు, కొనుక్కునేవాళ్లు శక్తిలేనివాళ్లు,—చేజాపేవాళ్లు అందరికీ కడుపు నిండేది.

ఇంత వ్యాపారం జేస్తూంటే-ఆసామికేం మిగిలేది ? పొట్ట గడిచేది ! ఏడాదికోసారి సముద్ర స్నానాలప్పుడు ఓ పది కరుకులు, మిగిలితే అది-

—55 వ పేజీ చూడండి

మల్లాది రామకృష్ణశాస్త్రి

# సరాగమాల

## వి ఎ కె రంగారావు

కొద్ది రోజుల క్రిందట ఘంటసాలవారిని కలుసుకోవాలని రాజలక్ష్మివారి ఆఫీసుకి వెళ్ళాను. అప్పుడే బయటికి వెళ్ళారని మరొక అర గంటలో తిరిగి వస్తారని చెప్పితే సరేనని పైకి అంటూ ఆ కంపెనీ సహనిర్మాతలైన డూండీ ఆఫీసు గదికి వెళ్ళాను. ఇంతవరకు తమచిత్రం "రక్త సంబంధం" కోసం రికార్డు చేసిన పాటలు కొన్నిటిని డూండీ టేప్ రికార్డర్ వేసి వినిపించారు. చాలా మట్టుకు దీనికి మాతృకైన తమిళ చిత్రం 'పాశ మలర్' లోని వరుసలే. స్వంతంగా రెండు వరుసలను మాత్రం ఘంటసాల చేశారట. అందులో ఒకటి విన్నాను. పి. బి. శ్రీనివాస్, పి. సుశీల పాడిన యుగళగీత మది. "ఎవరో నను కవ్వించి పోయిన దెవరో" అంటూ చిక్కని (సి. నారాయణరెడ్డి) కవితచేత, చక్కని వరుసచేత శ్రోతలను కవ్వించే పాటది. ఆ చిత్రంలోని పాటల కన్నిటికీ తప్పక తలమానిక మవుతుంది. ఘంటసాల చేసిన బొంబాయి మార్కు (అనుకరణ ఏమాత్రం కాదు) ఆర్కెస్ట్రేషన్ చినదాని చిలిపి పెదాల దాగిన చిరునవ్వులాగ ఉంది. కష్టపడి తమ స్వంత కృతులను యింత ప్రతిభావంతంగా, యింత హాయిగా చేస్తుంటే, వీరిని సంగీతదర్శకునిగా పెట్టుకుని బలవంతాన తమ చిత్రాలలో హిందీ తమిళ పాటల వరుసలు వినిపించే దర్శక, నిర్మాతల మేధస్సును

> కొనియాడ తరమా
> వేనోళ్ల ఆదిశేషునకైనా
> కొనియాడ తరమా
> తాహత జేకుత ధింకిట ధింకిట
> కొనియాడ తరమా
> తత్త తాహతజం, తాహతజం
> హతజం, తజం, తజం
> కొనియాడ తరమా !

చలనచిత్ర నిర్మాత దర్శక ప్రజ్ఞావిశేష సంకీర్తనం సంపూర్ణం. శ్రీ రమారమణ గోవిందోహరి.

అంతలోకే ఘంటసాల తిరిగి రావటంవలన క్రిందనున్న రిహార్సలుగదిలోకి వెళ్ళాను. ఎవరో ఒక కొత్త అమ్మాయికి పాట "ఆడిషన్" చేయిస్తున్నారు. అది ముగిసినతరువాత "పట్టిందంతా బంగారం" అనే ఆగిపోయిన చిత్రానికి తాము చేసిన పాటలను వినిపించమని ఘంటసాల వారిని కోరాను. తమ సహాయకులు సంగీతరావు హార్మోనియం అందుకోగా, రాఘవులు పాట చరణాలు అందీయగా మూడు పాటలు పాడి వినిపించారు. ఒకపాట "ఎందుంటివోయి రాజా ఎటు లోర్చుకొంటివోయి" అన్నది, సుశీల పాడినదట, అపూర్వంగా ఉన్నది. ఎప్పుడో విజయనగరం వెళ్ళగా అక్కడ ఒక జముకులవాడు పాడిన సారంగధర చరిత్రలోని ఒక వరుసను తీసుకొని దానికి నగిషీల చిలవలు పలవలు చెక్కి, స్వరక్రమాన్ని నిర్ణయించి, పై పాటకు వరసను ఏర్పరదామని ఘంటసాల అన్నారు. ఆ చిత్రంలోదే మరొకపాట ఘంటసాల సోలో "ఈ జగన్నాటకాన మన నటనా అఘటిత ఘటనా" అన్నది నిజానికి ఒక పాట కాదు. యవ్వనావేశంలో ఒక యువకహృదయం పరుగులిడే పూలబాట.

ఇంత చక్కని పాటలు (సదాశివబ్రహ్మం సాహిత్యం) మరెందులోనైనా జొప్పించి వినిపించ కూడదా అని అడుగగా వీలునుబట్టి చేయాలి అని అన్నారు. అవును మరి. ఒక కథకు, ఒక కథనం ప్రకారం వ్రాసి వరస కట్టిన పాటలు గభీమని మరొక చిత్రంలో పెట్టేద్దామంటే మాటలా !

ఘంటసాల ఎప్పుడో పాడిన "బహుదూరపు బాటసారి" చాలమందికి తెలుసు. కాని ఆ పాట వారు స్వంతంగా వ్రాసినదే అని ఎంతమందికి తెలుసు ? ఈమధ్యనే వీరు పాడిన రెండు జానపద గేయాలు, రెండు పాటలు వినాయకచవితికి సంబంధించినవి. హెచ్ ఎం. వి. వారు రికార్డు చేశారు. చవితి సమయానికి విడుదల చేస్తారు.

* * *

### అప్పగింతలు జి. ఇ. 35298

సినిమాలలో బొమ్మలపెళ్లిళ్ల పాటలు ఇంత వరకు పదుల కొలది వచ్చివుంటాయి. వాటన్నిటికీ స్వరస్వనసమ్మేళనంలోనూ, రచనలోనూ తలమానికం వంటిది "రాజా రాణి పెళ్లి". చిన్నవాళ్లకి అలవిగావనుకొనే సంగతులు వేయించకుండానే పాటను రాణింపుకు తెచ్చారు సంగీత దర్శకులు బి. గోపాలం. కమ్మని మాటలతోనే కమనీయమైన పాటను వ్రాశారు నార్ల చిరంజీవి. సుశీల పాడటంలో చిన్నతనాన్నుండే చిలిపితనమంతా, చీకూ చింతా లేని సంతోషమంతా, మాయామర్మములేని మురిపెమంతా వెల్లివిరిసింది. పాటకు యింకా ప్రత్యేకతను యిచ్చినవి వాద్యగోష్ఠిలో వినపడే "తూతూ" బాకాలు పల్లవిలో "రాజా రాణి పెళ్లి" తరువాత "రాజాపెళ్లి, రాణి పెళ్ళి రాజాపెళ్లి" మార్చి మార్చి అదే స్వరస్థానాలలో అనటం. "చెలినీ చేకొనుమా సాగునులే హాయిగ సంసారం" అన్న స్థానంలో ఉన్న ప్రతీ చరణాన్ని రెండువిధాల తాళగతులలో పాడటం. హుషారైన ఈ పాటను సరైన, జోరైన చిత్రీకరణ.

రెండవప్రక్కనున్న "విరిసె ఈరేయి" పాటను సినిమాలో ఆనందించటానికి ప్రతిబంధకమైనవి విడ్డూరమైన రంగాలంకరణ వికారమైన నాట్యం. వినటానికి విరితేనియలా తీయగా ఉంది. "కన్నె వయారి కౌగిలిలోన కరిగే ఓ నెలరాజా పులకించేవో, మురిపించేవో వెన్నెలలో" అంటున్న సుశీల స్వనలీల సురకాంతలకైనా అందని స్వరలీల. "విరిసే" అన్న వెంటనే అందుకునే తబలా వరుసలు బి.గోపాలం ఎక్కడనుంచి దొంగిలించారో! ప్రియుని రాకజూచి ఉరకలెత్తే కన్య హృదయంలోంచి కాదుగదా ! పాట మొదటనున్న ప్రతిధ్వని, సన్నాయి సన్ననిసవ్వడి "కలను కన్న కలవరాన్ని" స్పష్టంగా సూచిస్తున్నాయి. మధ్యన వినబడిన అకార్డియన్ వినపడకపోతే ఇంకా బాగుండేదనిపిస్తున్నది. యువప్రేమికులకు, వయస్సు మీరినా యువహృదయాలున్నవారికి మరలిరాని మధురవసంతాన్ని" తలపిస్తుం దీపాట. రెండు చక్కని పాటలు అందించినందుకు బి. గోపాలంగారికి ఒక అరవిరిసిన అరవిందమొగ్గ.

### కలిమిలేములు జి. ఇ. 35304

"రసికునికీ రాత్రికీ, వయసుకీ, వలపుకీ వక్షోవర్తులానికీ మోహానికీ మల్లెపువ్వుకీ మనోరమణునికీ" ఎటువంటి లోకోత్తరమూ మహోదాత్తమూ అయిన సంబంధముందో అదే మల్లాది రామకృష్ణ శాస్త్రిగారి సాహిత్యానికీ అశ్వత్థామ సంగీతానికీ ఉంది.

> "కొమ్మలమీద కోతి కొమ్మచ్చులాడింది తెల్లా
> తెల్లని ఓ బుల్లియెండ
> నేలమీద వాలింది వాలుమొగ్గ లేసింది నల్లా
> నల్లని ఓ బుచ్చినీడ"
> "కొంచెంగా యెండతీసి గోరంతా నీడబూసి
> గమత్ గమత్ బొమ్మలుచేసి అమ్మాయిగారికి
> యివ్వనా."

వెన్నెల ఆహ్లాదకరమైనది. దాంతోబాటు చంద్రుడుకూడా ! వీటిపై కవిత్వంచెప్పి విన్నవారిని మెప్పించటం ఒక పెద్దవిషయం కాదు. సూర్యునిమీద యెండమీద కవనంకట్టి, అందులో దవనంవంటి ఉపమలు చొప్పించి శ్రోతలలో రసజ్ఞులు కానివారినీ రసికులనుజేసి "స్వర్గం మనదే చల్లనివేళ స్వప్నం నిజమా చక్కని సీమ" ను వలపింప జేయుగలది ఒక్క మల్లాదివారి కలమే ! అశ్వత్థామ సంగీతానికి నడకనేర్పింది చిన్నతనపు కలలకు లయ కుదిర్చిన అరమరికలు లేని అమాయిక ప్రేమ. జానకీరాణి తమ గాత్రంలో ఎంత కమ్మని తేనియలు కుమ్మరించారని ! అహర్నిశం బాల్యావస్థలోనే కాలం గడిపే అవకాశమే ఉంటే చెలిమే చిక్కనినీడల చెట్లయి, వలపేవాడని తీయని ఫలమై, అనురాగమే వీడని వాడని పాటై యుండగా "కొమ్మలమీద" పాడుకుంటూ ఉందామని కోరుకోనివా రెవ్వరు ?

రెండవప్రక్క లీల ఘంటసాల పాడిన యుగళ నాట్యగీతం. ప్రత్యేకత ఉన్నదంతా ఆ నడకలోనే. అశ్వత్థామే "సమాజం" లో "చక్కనిచుక్క" అనే మరో నృత్యగీతానికి ఈ నడకే ఉపయోగించారు. పాట సాహిత్యం "కాంగ్రెసుకే లే, లే" లాగ ఉంది.

### టాక్సీరాముడు జి. ఇ. 35208

సుశీల పాడిన "గోపాలబాల" పాటకు చక్కని వరస అమర్చారు టి. వి. రాజు. వీరు ప్రయోగించిన వేణువు, సితార్ పాటకు చెప్పలేని ఒక వింత అందా

—62వ పేజీ చూడండి

# హరివంశము

హారీత శివశర్మ

## సాందీపని పర్వం-67

పౌండ్రకుని మాటలు వినగా మాతలికి నవ్వు వచ్చినది. నవ్వినాడు. "మహారాజ ! నేను ఏ వందినో, మాగధుడనో అయినచో తమకీ వృత్తాంతము నెట్లు చెప్పగల్గుదును" అన్నాడు.

పౌండ్రకుడు మెల్లన హసించినాడు.

"మాతలి ! నీవు ఇప్పుడు చేయుచున్న పని అదియేరా ! వా డెవడో శ్రీకృష్ణునిసారథి యొక్క పని చేసెననగా దానిని నీవు అతిశయోక్తులతో నాముందు ప్రకటించుచున్నావు. మరి వందులును మాగధులును చేయు పని అదియే కదా !"

మాతలికి ఈసారి నవ్వు రాలేదు. అతని కన్నులు ఎఱ్ఱబడినవి. ఆ రత్నముల కాంతులలో నా యెఱ్ఱదనము మరియు వెఱ్ఱనై కన్పించినది.

"మహారాజా! మీరు వన్నేమైనా ననుడు. దారుకస్వామివిద్యను గురించి నే నబద్ధము చెప్పుచున్నానని మాత్ర మనకుడు. స్వామి ! ఇప్పుడు నేను చెప్పుచున్న ఉదంతము నేను నా కన్నులతో చూచినది. దానిని చూచి నేను స్థంభించిపోయినట్లే నచ్చటి సర్వప్రకృతియు స్థంభించిపోయినది. సూర్యుని రథమును నడపుచు తనకన్న సారథ్యవిద్యలో నధికుని చూచి అనూరుడే రథము నాపినాడో; అప్పుడు సూర్యుని వేడిమి భరించరానిదైపోయినది. మహారాజ ! సూర్యుడు తన సహస్రములైన నేత్రములతో ఆ అద్భుతమును దర్శించియుండవచ్చును .... "

"అవునయ్యా ! మాతలి ! ఆతడు దర్శించియుండవచ్చును. నీవును దర్శించితివి. ఆ దర్శించినది ఏమో చెప్పరాదా !" అన్నాడు పౌండ్రకుడు. అని నవ్వినాడు. "ఓరి ! మాతలి ! నీవు విచిత్రమైన వాడవురా ! నీవు నాయందు సేవకుడవు. దారుకుని యందు శిష్యుడవు. ఇది విచిత్రమైన సంబంధము. దారుకుడు కృష్ణుని సారథియని, ఆ కృష్ణుడనిన నాకు పడదని యెరిగియు నీవు వానిని నాముందు పొగడుచున్నావు. నేను వినుచున్నాను. వినుచు నేమోయనగా నన్ను నీవు చులకన చేయుచున్నావు. నాయందుకన్న దారుకునియందు నీకు భక్తి యెక్కువ. మరి నీవంటివాడు నాకు సారథిగా నుండతగునా యని ఆలోచించుచున్నాను" అన్నాడు.

మాతలి మరల నవ్వినాడు. మరల ఇట్లనినాడు; "స్వామి ! మీకును దారుకుని విద్యయనిన గౌరవమున్నది. ఎవరి కుండదు ? వాసుదేవునికే ఉన్నది. మరి మనమెంత ? మీరు నేను తమ్ము చులకనచేయుచున్నట్లు భావించుచున్నారు. అది సరికాదు. నేను దారుకస్వామివిద్య ఇట్టిదని చూచినదానిని చెప్పుచున్నాను. తమరు దానిని తమకు వాసుదేవునిపైగల విరోధమునచేసి అన్యథా వ్యాఖ్యానించుచున్నారు. నేనేమి చేయను. మేము ఎప్పటినుండియో కాశీరాజులకు సారథులము. ఉన్న మాట చెప్పమందురా ! మీర వద్దన్నచో నేను మీ రథమును తోలను. నేను నేర్చిన విద్యను నాయందే జీర్ణించుకొందును. మరియొక దేశపు రాజులను కొలుతునా ! మా అమ్మ సుదక్షిణాదేవి యున్నది. ఆమె రథమునకు సారథినై యుందును. నిజమునకు ఆమెయే కదా అధినేత ...... "

పౌండ్రకుని కన్ను లంతలో ఎఱ్ఱనైనవి. అంతలో ఎరుపు తగ్గినవి. అతడు హఠాత్తుగా విచిత్రముగా నవ్వినాడు. "ఓరి ! ఓరి ! మాతలి ! నిన్ను కాశికనుండి వెడలకొట్టింతును. నన్ను కాశికకు అధినేతవు కాదందువా ? సుదక్షిణ అధినేత్రి యందువా ? ఓరి ! నీవు సేవకుడవు ! నేను రాజును. పొమ్మావల" అనినాడు.

మాతలి మాటాడలేదు. "మహారాజ ! తమరు నన్ను తప్పుగా అర్థము చేసికొన్నారు. భగవంతుడు నాయందు హృదయము నొక్కతీరుగను, మాటను మరొక్కతీరుగను నియమించినాడు. సరే ! నేను పోవుచున్నాను ..... "

"కాశికను వదిలియేనా .... "

మాతలి మాటాడలేదు. బరువైన హృదయముతో ఆ మందిరమును వదిలి పోయినాడు. పౌండ్రకునకు అప్పటికిగాని తాను తొందరపడితినని తెలియలేదు. అది అట్టులని తెలియగనే నాతడవుడు కరచుకొన్నాడు. అందరివంకను చూచినాడు. విచిత్రమేమనగా అతని కన్నులలో కోపము, ముఖమున దైన్యము యౌగపద్యముగా భాసించినవి. అతడు అచ్చట యెవ్వరితోడను మాటాడలేదు. మంత్రాలోచనామందిరమునుండి బయటికి వచ్చినాడు. వాచాలు డతని ననుసరించినాడు. తక్కినవారికి తాము పోవలయునో, పోరాదో అర్థముకాలేదు. వారిలో ఒక్కడు ధైర్యము చేసినాడు. వాడును రాజును వెంటనంటి నడచినాడు. రాజు కొంత దూరము పోవువరకు నెవ్వరు[illegible]లేదు. అప్పుడు వాడు రాజును సంబోధించినాడు:

"మహారాజా !"

"ఎవరు !"

"నేను దత్తిలుడను."

"ఏమిరా !"

"తమరు అకారణముగా మాతలిపై కోపము చేసినారు. వాడు అట్టివాడని తమకు తెలియదా ! మరియు రాజసేవలో వాని తండ్రి తాతల శరీరములు మునిగి తేలినవి. వాడును అట్టివాడు. మేము వృద్ధులము. విద్యయందా ! కాదు. వయస్సుచేత వృద్ధులము. వాడు విద్యచేత వృద్ధుడు .... "

"మరి అహంకారముచేత !"

"ప్రభువులు వాని ఉత్సాహమును అహంకారమనుచున్నారు. .... "

"నీవు పొమ్ము ! మీ రందరును పొండు."

"చిత్తము."

పౌండ్రకుడు మరల ముందునకు నడచినాడు. దత్తిలుడు చేయునది లేక వెనుతిరిగినాడు. వాడు రాగా మంత్రాలోచనామందిరములోని సారథులు "ఏమి" యన్నట్లు వానివంక చూచినారు. వాడు వారితో మాటాడలేదు. వారివంక చూచినాడు. ఆ కన్నులలో దుఃఖ మున్నదో ! బాధ యున్నదో ! దైన్య మున్నదో ! వాడు ఎత్తిన కన్నులు దించుకొనినాడు. మారుమాటాడక బయటకు నడచినాడు.

వానివెంట తక్కినవారుగూడ బయలుదేరినారు. పౌండ్రకుడు దూరముననుండి వారిని చూచెను. తనలో తాను నవ్వుకొనెను.

"వాచాలా!"

"వాసుదేవ!"

"మాతలి యీ ప్రవర్తనము బాగున్నదా?"

"వాసుదేవ! నిజము చెప్పుమందువా! నీవు వానిని రెచ్చగొట్టితివి. వాడు నోటిదురుసు మనిషి యని నీకు తెలియును. మరియు వాడు నీయందు అమితమైన పరిచయముచేత చనువుగలవాడు. నిన్ను తనకు స్నేహితుడును, సమవయస్కుడును నైన స్నేహితునిగనే చూచునుగాని, రాజుగా చూచుట యెరుగడు. వానికింకను అది యలవాటు కాలేదు. సుదక్షిణాదేవినందువా! ఆమె కాశికలో యందరికిని రాణి. ఆమెయందు కాశికకు ప్రేమయు, గౌరవమును. మాతలికివి అంతియు. ఇది నీకు తెలియదా?

—54 వ పేజీ చూడండి




దైవజ్ఞపాతూరి శ్రీరామమూర్తి

**3-8-1962 శుక్రవారము మొదలు**
**9-8-1962 గురువారము వరకు**

## మేషం :

(అశ్వని, భరణి, కృత్తిక 1 పా.)

కుటుంబంలోనివారి సహకారం లభిస్తుంది. ఖర్చులు మిమ్ములను వెంటాడుతూఉంటవి. అయితే ఏవిధంగానూ అసంతృప్తి చెందవలసిన అవసరం కలుగదు. స్థిరాస్తులవంటివానిమీద మీ ధనాన్ని వినియోగించవలసి వస్తుంది. అకస్మాత్తుగా బంధువులవద్దనుంచి కష్టవార్తలు తెలుస్తవి. వ్యవహార రంగంలో ఆలస్యం తోస్తుంది. అందువల్ల ముందు ముందు లాభం పొందగలుగుతారు. వృత్తి వ్యాపారాలలో క్రొత్త ప్రయత్నాలు సాగించవలసిన సమయం కాదు. ఎదటివారి మాటలకు ప్రాముఖ్యం ఈయటం వల్ల అనవసరంగా ధనవ్యయం కాదగిన సమయం. జాగ్రత్తగా ఉండండి. మీ శక్తిసామర్థ్యాలవల్ల సంఘంలో పేరుప్రతిష్ఠలను సంపాదించుకొంటారు. బంధుమిత్రులకు అప్పు ఈయవలసిన బాధ్యతలు ఏర్పడతగిన సమయం. 5, 6 తేదులలో సుఖభంగం, ఆదుర్దా కలిగే వార్తలు.

*　　*　　*

## వృషభం :

(కృత్తిక 2, 3, 4 పా., రోహిణి,
మృగశిర 1, 2 పా.)

చేతిలోవున్నంతవరకు స్వశక్తితో సకాలంలో మీ కార్యక్రమాలను పూర్తి చేయటానికి ప్రయత్నించండి. మాటలలో లభించే ఆదరణ క్రియలో కనుపించదు. ఇతరులవద్దనుంచి రావలసిన ధనం సమయానికి లభిస్తుంది. మనస్సులో తరచు సందేహాలు కలుగుతూ ఉంటవి. కాని, యథార్థంగా అపకారం జరుగదు. మీ శక్తిసామర్థ్యాలను చక్కగా వినియోగించుకొనతగిన అవకాశాలు లభిస్తవి. సాహస కార్యాలలో ప్రవేశించవలసివస్తుంది. ప్రస్తుతం మీ ధనాదాయం పెద్దగా పెరుగకపోవచ్చు. కాని, అధికారులవల్ల ఆదరణ, వ్యవహారరంగంలో అనుకూలత బాగుంటవి. మాటలలో హాస్యానికైనా తొందరపడవద్దు. వారాంతంలో దేహసౌఖ్యం లోపిస్తుంది. 3, 4 తేదులలో వృత్తిలో అనుకూలత, శుభకార్యాలు.

### గ్రహస్థితి

వృషభంలో అంగారకుడు, కర్కాటకంలో సూర్య, రాహువులు, కర్కాటక, సింహాలలో బుధుడు, కన్యలో శుక్రుడు, మకరంలో శని కేతువులు, కుంభంలో గురువు, సింహ, కన్య, తుల, వృశ్చికాలలో చంద్రుడు.

*　　*　　*

## మిధునం :

(మృగశిర 3, 4 పా., ఆరుద్ర, పునర్వసు
1, 2, 3 పా.)

అన్నివిధాలా జాగ్రత్తగా ఉండవలసిన సమయం. స్నేహితుల మాటలను నమ్ముకుని చేతిలోఉన్న డబ్బు ఖర్చు చేయటంవల్ల మధ్యలో కష్టపడవలసివస్తుంది. కుటుంబంలోనివారి ఆరోగ్యం కూడా బాగుండదు. సంఘంలో పలుకుబడి పెరుగుతుంది. అందువల్ల తాత్కాలికంగా ఉపయోగం ఉండదు. విద్యార్థులకు ఉత్సాహం తగ్గుతుంది. వ్యాపారరంగంలో ముందుకు వెళ్ళటానికి అవకాశం లభించదు. అయితే ప్రశాంతంగా ఉండటానికి బుద్ధిపుట్టదు. మీ మాటను గౌరవించవలసినవారు కూడా విరోధులతో కలిసిపోగల సమయం. చల్లని మాటలతో మీ పనిని గడుపుకొనటానికి ప్రయత్నించండి. న్యాయము, శక్తిసామర్థ్యాలకన్నా యుక్తి ప్రధానం అవుతుంది. 7, 8 తేదులలో గౌరవప్రాప్తి, పుణ్యకార్యాలు.

*　　*　　*

## కర్కాటకం :

(పునర్వసు 4 పా., పుష్యమి, ఆశ్లేష.)

మీ బుద్ధిబలంముందర ఎవ్వరూ ఏమీ చేయజాలరు. అయితే ధనరూపంలో పెద్దగా ఉపయోగం కనుపించకపోవచ్చు. రాజకీయాలలో మీ విలువ పెరుగుతుంది. ప్రయాణాలు నిరాటంకంగా చేస్తారు. మిత్రులవల్ల జరిగిన లోపాలను మీరు ధైర్యంతో కలుగజేసుకొని సర్దుబాటు చేయగలుగుతారు. వృత్తివ్యాపారాలకు సంబంధించిన వార్తలు సకాలంలో వస్తవి. అయితే తరచు మనస్సును చికాకు పరచటానికి ప్రయత్నించేవా రుంటారు. స్వశక్తివల్ల గౌరవస్థానాన్ని పొందగలుగుతారు. తలవని తలంపుగా ధనలాభం, వినోద కార్యక్రమాలలో పాల్గొంటారు. 8, 9 తేదులలో మానసిక్లేశము, ధనలాభం, సంఘంలో గౌరవం.

*　　*　　*

## సింహాం :

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

ఎవరితో ఏవిధంగా సంచరించటం అవసరమో తెలుసుకుంటారు. ఒకరి మెప్పుకోసరం ఎదురు చూడకుండా న్యాయంగా మీ కర్తవ్యాన్ని నెరవేర్చుకొలుగుతారు. అనవసరమైన ఆడంబరం లేకుండా ప్రశాంతంగా కాలం జరుగుతుంది. కుటుంబంలో సుఖ సంతోషాలు లభిస్తవి. పాత మిత్రులను అకస్మాత్తుగా కలుసుకొంటారు. ఇంతకుముందు చేయజాలక నిలుపుకున్న కార్యక్రమాలు తిరిగి ఆలోచనకు రాగల సమయం. ఏ సందర్భంలోనూ మీ చేతిలోని ధనాన్ని, నమ్మి ఇతరులకు ఒప్పగించవద్దు. వ్యవహా

భాగంలో మధ్యవర్తులవంటివారు వక్రమార్గానికి తిరుగుతారు. ముందుగా వాగ్దానాలు చేయతగిన సమయంకాదు. శుభ పుణ్యకార్యాలు సులభంగా జరుగుతవి. 5, 6 తేదులలో వృధా సందేహాలు, త్రిప్పట అధికం.

## కన్య :

**(ఉత్తర 2,3,4 పా., హస్త, చిత్త 1, 2 పా.)**

అన్నివిధాలా అదృష్టం కలసి వస్తున్నట్లే తోస్తూ ఉంటుంది. మీ ఆలోచనలు, ప్రయత్నాలు భారీగా చేస్తూ ఉంటారు. అందుకొనేసమయంలో ఏదో ఒక స్వల్ప కారణం అడ్డు వస్తూ ఉంటుంది. క్రమక్రమంగా మీ రోజువారీ కార్యక్రమాలు జయప్రదంగా జరుగుతూ ఉంటవి. ఆదాయం మామూలుగా ఉంటుంది. బంధుమిత్రులవల్ల ఖర్చుల తాకిడి పెరుగుతుంది. గత వారంకన్నా మీ ఆరోగ్యం బాగుంటుంది. సాధ్యమైనంతవరకు ఇతరులకు హామీ ఉండటంవంటి బాధ్యతలు పైన పడకుండా చూచుకొనండి. దూరపు ప్రయాణాలు చేయవలసి రావచ్చు. ముందు ముందు లాభించగల వ్యవహారాలలో డబ్బు పెట్టుబడి పెట్టవలసి వస్తుంది. 5, 6 తేదులలో శుభవార్తలు, అకస్మాద్ధన లాభం.

* * *

## తుల :

**(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ, 1, 2, 3 పాదాలు)**

మీ విద్య, బుద్ధి చాకచక్యాలను చక్కగా ఉపయోగించుకొని గౌరవస్థానాన్ని పొందగల సమయం. ఆదాయం ధారాళంగా వస్తుంది. అందుకు తగినట్లు అవసరాలున్నూ పెరుగుతవి. మీ ఆరోగ్యాన్ని గురించి శ్రద్ధ వహించటం అవసరం. రక్తదోషం, గుండె, శిరస్సుకు సంబంధించిన భాగాలలో బాధ తోచగల అవకాశాలున్నవి. వృత్తి కార్యకలాపాలలో తోటివారి పోటీని ఎదుర్కొని నేర్పుతో విజయం సాధించగలుగుతారు. కుటుంబంలో తలపెట్టిన పనులు వెంటవెంటనే సానుకూలంకావు. అభిప్రాయ భేదాలు వస్తూ ఉంటవి. ప్రయాణాలు అనుకూలించకపోవచ్చు. నౌకరులవల్ల కార్యసిద్ధి ఉంటుంది. బంధువులవద్ద మంచి ఎదురుచూస్తున్న వార్తలు సుముఖంగా రావు. విద్యార్థులకు ప్రోత్సాహదాయకమైన కాలం. 3, 4 తేదులలో స్వల్పలాభం, అధికారుల పరిచయం, కార్యభారం, విసుగుదల.

* * *

## వృశ్చికం:

**(విశాఖ 4-వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ.)**

దైవబలం బాగున్న సమయం. కొన్ని సందర్భాలలో కనుపిస్తున్న నిదానమే మీ విజయానికి కారణం అవుతుంది. మీ స్వశక్తితో ఎవరితో ఏవిధంగా కార్యం సాధించుకొనవలయుననే విషయం తెలుసుకొని ప్రవర్తించగలుగుతారు. సంఘంలో అన్నివిధాలా మీ మాట నెరవేరగల సమయం. కుటుంబంలో శుభకార్యాలు చక్కగా నెరవేరుతవి. ఇంతకుముందుకన్నా మనశ్శాంతి లభిస్తుంది. అకస్మాత్తుగా మీకు సంబంధం లేని బాధ్యతలు పైన పడగల సమయం. విద్యావంతులతో ప్రసంగించగల అవకాశాలు లభిస్తవి. వృత్తివ్యాపారాలలో ఎదటివారి కుయుక్తులను తెలుసుకొని జాగ్రత్తపడగలుగుతారు. 8, 9 తేదులలో శుభం.

* * *

## ధనుస్సు :

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)**

ఫలితం చేతికి రావటం అనేది కొంచెం వెనుకా, ముందు కావచ్చు. అంతమాత్రాన ఆదుర్దా చెందవలసిన అవసరంలేదు. ప్రయాణాలు అనుకూలిస్తవి. తోటివారి సహాయం అన్నివిధాలా లభిస్తుంది. అపవాదులు రానున్నట్లు తోచవచ్చు. కాని, దైవానుగ్రహంవల్ల మీ గౌరవం దక్కించగల మనుష్యులు లభిస్తారు. చాలాకాలంనుంచి మీ మనస్సులో ఏర్పడిన అసంతృప్తికి సంబంధించిన కారణాలు క్రమంగా తొలగిపోతవి. అగ్ని, యంత్ర సంబంధమైన పనులు చేయు సమయంలో జాగ్రత్తగా ఉండండి. వారం రెండవభాగంలో మీ తొందరపాటువల్ల కలహాలు రాగల అవకాశా లున్నవి. ఖర్చులను తగ్గించటానికి ప్రయత్నించండి. 5, 6 తేదులలో శుభవార్తలు, వ్యవహారజయం.

* * *

## మకరం :

**(ఉత్తరాషాఢ 2, 3, 4 పా., శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)**

మీ శక్తిసామర్థ్యాలు, ప్రత్యక్షమైన అవకాశాలు కొంతవరకు లభిస్తూ ఉంటవి. అయితే మనస్సుమాత్రం మిమ్ములను ధారాళంగా ముందుకు పోనీయదు. ప్రస్తుతం సంబంధంలేని విషయాలను గురించిన ఆలోచనలు ఎక్కువ. తలవని తలంపుగా ధనలాభం కలుగతగిన అవకాశాలున్నవి. వృత్తి, వ్యాపారాలలో మీ జాగ్రత్తవల్ల ఒడుదుడుకులు రాకుండా చూచుకోగలుగుతారు. డబ్బుకు సంబంధించిన లావాదేవీలలో నిష్కర్షగా వ్యవహరించవలసిన సమయం. మాట నిలకడలేని మనుష్యులతో సంబంధం పెట్టుకొనటంవల్ల వృధాశ్రమ పడతారు. కుటుంబంలో ఇంతకుముందున్నటువంటి అసంతృప్తి తొలగిపోతుంది. 3, 4 తేదులలో పనులలో నిదానము, డబ్బు ఇబ్బంది.

* * *

## కుంభం :

**(ధనిష్ఠ 3, 4 పా., శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)**

ఈ సమయంలో తరచు నిరుత్సాహం తోస్తూ ఉంటుంది. కార్యరంగంలో మీ లోపాలను బయట పడకుండా చూచుకొనగలుగుతారు. మీకు ఆశ కలిగేటట్లు మాట్లాడి మీ పనులకు భంగం కలిగించేవారేగాని, నిజంగా సహాయం చేసేవారు తక్కువ. విద్యా, వినోద రంగాలలో మీ విలువ పెరుగుతుంది. మంచివారి స్నేహము, ఆదరణ లభిస్తవి. కుటుంబంలో దుబారా ఖర్చులు పెరుగుతవి. ఏ సమయంలో చేయవలసిన పనిని ఆ సమయంలో చేయలేకపోతారు. ఎదటివారి మనస్తత్వం తెలుసుకోకుండా స్నేహం పెంచుకొనతగిన సమయంకాదు. దూరమందున్న బంధుమిత్రులవద్దనుంచి కష్టవార్తలు తెలుస్తవి. 7, 8 తేదులలో ధనలాభం, సంఘంలో గౌరవం.

* * *

## మీనం :

**(పూ. భాద్ర 4 పా., ఉ. భాద్ర, రేవతి.)**

మనోనిగ్రహం బాగుంటుంది. వ్యవహార విషయాలలో ఏర్పడిన ప్రతిబంధకాలు మబ్బు విడిపోయినట్లుగా విడిపోయి సులభంగా పరిష్కారానికి వస్తవి. తగినంత విశ్రాంతి లభిస్తుంది. వృత్తిలో మీ ప్రతిభను చూపి పదిమందిలో గౌరవం పొందగలుగుతారు. విలాస, వినోద కార్యక్రమాలు ప్రశాంతంగా జరుగుతవి. విద్యావంతుల పరిచయం లభిస్తుంది. వారం రెండవభాగంలో మీ అంచనాకు మించి ఆదాయం లభిస్తుంది. విలువగల వస్తువులు కొనే సందర్భాలలో మోసం జరుగకుండా జాగ్రత్తపడండి. క్రొత్తవారితో చేరి జాయింటుగా ఏ పనులు ఆరంభించవద్దు. కష్టవార్తలు తెలియగల సమయం. 5, 6 తేదులలో వృధా కలహాలు, కష్టవార్తలు. ★

## ఈ వారము ధరలు

బంగారు ధర కొద్దిగా మందీ వస్తుంది. వెండిధరలలో పెద్ద మార్పులు ఉండవు. వేరుశనగపప్పు ధరలో ముందు మందీ, వారం రెండవ భాగంలో కొద్ది పెరుగుదల, వేరుశనగనూనెధర 7, 8 తేదులలో మందీ రాగల అవకాశాలున్నవి. నూవుల ధర క్రమంగా పెరుగుతుంది. ప్రత్తిధర తగ్గుతుంది. మిర్చిధర వారాంతంలో పెరిగే అవకాశా లున్నవి.

---

"ఒరేయ్! ఆమధ్య నాదగ్గర అయిదు రూపాయలు తీసుకున్నావు గుర్తుందా?"

"లేకేం. ఆ నోటు నెంబరు కూడా రాసుకుని మళ్ళీ అది మన చేతుల్లోకి ఎప్పుడు వస్తుందా అని కనిపెట్టుకుని కూర్చున్నాను."

రాజేంద్రప్రసాద్ (కాకినాడ)



ఆఫీసులో పనిచేసుకుంటున్న శ్రీ బాపు.

# ఆంధ్రుల అభిమాన చిత్రకారుడు బాపు

కొన్ని సంవత్సరాల క్రితం 'అంతర్జాతీయ పత్రికలసంస్థ' (ఇంటర్నేషనల్ ప్రెస్ ఇన్‌స్టిట్యూట్) డైరెక్టర్ శ్రీ జిమ్‌రోజ్ మా కార్యాలయానికి వచ్చారు. అప్పుడు ఆంధ్ర సచిత్ర వారపత్రికలో 'రాజా-రైతూ' బొమ్మల కథ పడుతోంది. ఆవారం సంచిక పేజీలు తిరగేస్తూ శ్రీ రోజ్ బొమ్మలు వేసింది 'ఎవర'ని అడిగారు. మద్రాసులోనే ఉండే 'బాపు' అనే ఆయన వేస్తున్నారని చెప్పాము. వాటిని చాలా మెచ్చుకుని ఈ బొమ్మలు తాము ప్రపంచంలో చూసిన తక్కినవాటికి ఏవిధంగానూ తీసిపోవన్నారు.

ఈ అభిప్రాయంతో ఏకీభవించని వారుండరు. ఇప్పటికే సుమారు ఒక దశాబ్దంగా కంటికి ఇంపైన చిత్రాలతో శ్రీ బాపు ఆంధ్రప్రజానీకానికి ఎనలేని ఆనందం చేకూరుస్తున్నారు! శ్రీ బాపు బొమ్మలు చూడగానే గుర్తుపట్టేవిగా ఉంటాయి. అసలు, 'బాపు బొమ్మ' అందానికి ప్రమాణం అయిపోయింది.

ఆంధ్ర దేశమంతటా అన్నివర్గాల వారి అభిమానాన్ని చూరగొన్న కళాకారుడు బాపు అని నిస్సందేహంగా చెప్పవచ్చు. 'బంగారం-సింగారం', 'బుడుగు', 'మనవాళ్లు' చూసి, చదివి ఆనందించని తెనుగువారే ఉండరు. కాని శ్రీ బాపు అతి నిరాడంబర వ్యక్తి. ఆయనకు ప్రచారం గిట్టదు. సన్నిహితులకు తప్ప లక్షలాది పాఠకులకు శ్రీ బాపును గురించి ఏమీ తెలియదు. [వారి వివరాలు తెలుపమని కోరుతూ మా కార్యాలయానికి ఎన్ని ఉత్తరాలు వస్తాయో లెక్కలేదు!] ఆయన కూడా పత్రికలలో ప్రచారానికి ఇష్టపడలేదు!

జూలై 22 వ తేదీ 'సెవెన్‌స్టార్ సిండికేట్'—బాపు అభిమానుల సంఘం-వారు హైద్రాబాదులో బాపు బొమ్మల ప్రదర్శన జరిపారు. ఈ ప్రదర్శన వివరాలు అన్ని వార్తాపత్రికలలోనూ వచ్చాయి. ఈ సందర్భంలో 'ఆంధ్ర సచిత్ర వారపత్రిక' పాఠకులకు శ్రీ బాపును వ్యక్తిగతంగా పరిచయంచెయ్యవచ్చు కదా అని ఆయన ఫోటో ఒకటి వేసేందుకు అనుమతికోరాము. ఈ పేజీలోని ఫోటో ఆయనఇచ్చిందే!

శ్రీ బాపు అసలుపేరు సత్తిరాజు లక్ష్మీనారాయణ. పశ్చిమగోదావరి జిల్లాలో నర్సాపురంలో డిసెంబర్ 1933లో జన్మించారు. చదువు మద్రాసులోనే పూర్తయింది; బి. కాం., బి. ఎల్. పట్టభద్రులు (మద్రాసు లయోలా, లా కాలేజిలలో). ఎడ్వొకేట్‌గా 'ఎన్‌రోల్' అయినా ఆ వృత్తిమీద ఆసక్తి లేక వదిలివేశారు. వివాహం అయింది. ఒక కుమార్తె. ప్రస్తుతం సుప్రసిద్ధ ప్రకటనాసంస్థ ఎఫిషెంట్ పబ్లిసిటీస్‌లో పనిచేస్తున్నారు. పై ఫోటో ఆఫీసులో ఆయన తోటి ఉద్యోగి ఒకరు తీశారు. చిత్రకారుడు శంకర్, బాపు తమ్ముడు-పూర్తిపేరు శంకరనారాయణ. రేఖ, శేష, రంగ అనే పేర్లతో వేసిన బొమ్మలు శ్రీ బాపువేనని ఇప్పుడు బయటపడిపోయింది!

★

# చిత్రఖేదము

## 'సుకుమార్'

(గతసంచిక తరువాయి)

"ఒకాయన సినిమాపరిశ్రమలో లాభాలు కొట్టేద్దామని ప్లానులు వేసి, అంతక్రితం తాను చేస్తున్న ఒక సినీఉద్యోగానికి సలాముకొట్టి, కొంతమందినీ, కొంత డబ్బునూ పోగేసి, పెద్ద సినిమా తీస్తే ఇబ్బందులకు లోనుగావలసి వస్తుందని, ముందుగా ఒక డబ్బింగు చిత్రాన్ని తయారు చేయా లనుకొన్నాడు. ఆవిధంగా 'ప్లాని' (అనగా 'పన్ని' అని పాఠాంతరము. పన్నుట యనగా వల పన్నుట, పన్నులు పన్నుట—యోళ్ళే ప్లానులు పన్నుట—ఇంగ్లీషుభాష నుంచి కొన్ని మాట లొచ్చేసి, తెలుగై కూచున్న 'రోడ్డు' బాపతు మాటగా ఈ 'ప్లాని' కూడా నన్నమాట) ఏం చెబుతున్నానూ—ఆఁ .... ప్లానేసి, ఒక చిత్రాన్ని కొన్నాడు. దాన్ని తెలుగులోకి 'డబ్' చెయ్యాలి! ఒక రైటర్ను మాట్లాడాడు. మాట్లాడటం అంటే ఏమిటి—మాట్లాడలేదన్నమాట! రాత్రికి రాత్రి వెళ్లి, ఆయన్ను లేపి—'మీరు నాకు డబ్బింగు రాయాలి. ఇదిగో స్క్రిప్టు. తెల్లవారితే కాల్ షీటు, మీరేం అనుకోవద్దు. మూడురోజుల్లో పిక్చరు ఫినిష్ కావాలి.' అని చెప్పేసి, తుర్రుమని పోయాడు. పెద్దమనిషి ఆడిగాడుగదా అని, రైటరు ఒప్పుకున్నాడు. రాత్రంతా మేలుకుని, చాలామట్టుకు డైలాగులు రాసేశాడు. ఉదయమే డబ్బింగు. తనకు సంబంధం లేకుండా ఉండాలని నిర్మాత తన తరఫున ఒక మనిషిని ఏర్పాటు చేశాడు. ఈ మనిషి డబ్బింగు ఆర్టిస్టులను పిల్చుకొచ్చాడు. టకటకా జరిగిపోయింది—పని. మూడు రోజుల్లో డబ్బింగు ఐపోతే, అంత డబ్బూ ఒక్కసారే ఇస్తాడుగదా అని — ఎవరూ డబ్బుసంగతి ఎత్తలేదు. అసలు, 'ఎంత' అని ఎవరూ మాట్లాడుకోలేదు. పగలూ, రాత్రీ విధీ విరామం లేకుండా డబ్బింగ్ పూర్తిచేశారు. ఆ మర్నాడే పిక్చరు విడుదల! 'ఇదిగో వస్తా'నని, ఒక్కడికి కానీ చేతిలో పెట్టకుండా పారిపోయాడు నిర్మాత. ఎవడికి ఎంత యిస్తాడో తెలీదు, ఏంచేస్తాడో తెలీదు. ఐతే, పాపం ఆర్టిస్టులంతా మంచివాళ్ళు.

'పోనీలే, రాగానే యిస్తాడుగదా' అనుకున్నారు.

కొన్నాళ్ల కాయన దిగాడు. డబ్బింగు ఆర్టిస్టులూ, మ్యూజిక్‌వాళ్లూ డబ్బుకని వెళ్లారు. వాళ్లతో మాట్లాడడే! పైగా 'రైటర్కే కానీ ఇవ్వలేదు' అంటాడు. మరి కొన్నాళ్లకి మళ్లీ వెళితే 'ఎవరు మీరు ? ఎందుకొచ్చారు ? ఏంకావాలి ? మీరు డబ్బింగు చేశారా ? ఏ చిత్రం ? ఎప్పుడూ ?' అంటూ మాట్లాడాడు. ఎవరేం చేస్తారు చెప్పండి—ఓ ఎగ్రిమెంటా—ఓ మాటా! ఏమీలేదు. అందరూ కోరస్‌గా శాడ్‌సాంగ్ పాడుకుంటూ ఇళ్లకు పోయారు. దీని సినీతి :

"ఇంత డబ్బు అని మాట్లాడుకోనిదే ఈ పరిశ్రమలో ఏపనీ చెయ్యరాదు" అని తేల్చాడు రచయిత.

"అందర్నీ అట్లాగే గడతావా" అన్నాడు నిర్మాత.

"అందరిమాటా నేను చెప్పానా—ఎందుకేనా మంచిది-ముందుగా మాట్లాడుకోవటం, అన్నానుగాని

"అట్లాగేనయ్యా—నువ్వు కథ చెప్పు. ఆకథ నచ్చితే కదా, నీ విషయం ఆలోచించేది" అన్నాడుసలహా.

"నేను ముందుగా కథ చెప్పను. తీరా మీకు నచ్చాక, నచ్చలేదని నాతో అబద్ధమాడి, అందులో ఏదన్నా ఉంటే దాన్ని కాస్తా తస్కరిస్తారు. అమ్మా! ఎంతాశ!" అన్నాడు రచయిత.

"అయ్యా, నిర్మాత గారూ—ఈ రచయితలు నిక్కచ్చి మనుషులండీ నా మాట విని, ఏదో ఇస్తానని చెప్పండి" అన్నాడు సలహా.

"యాభై రూపాయలు సాలదా—"

"దేనికి ? నా కాయితాల ఖర్చుకా ?—సరిపోతుందిలెండి. కాకపోతే, చవకరకం కొనుక్కుంటాను" అన్నాడు రచయిత, ఒళ్ళు మండి.

"అడ్వాన్స్ బాబూ! అడ్వాన్సు" అని సర్దాడు సలహా.

"నోనో, మినిమమ్ హండ్రడండ్ వన్ ఈజ్ ది అడ్వాన్స్" అన్నాడు రచయిత.

"ఇదిగో నీ వళ్ళే నీదయ్యా—ఇప్పు డర్థం అవుతోంది నాకు—నువ్వెందుకని ముందుకు రాలేదో" అన్నాడు సలహా.

"ఆల్‌రైట్—సెలవు" అని లేచాడు రచయిత.

"కూచోవయ్యా—అయ్యా—ఆ, నూటఒక్క రూపాయీ అడ్వాన్సుగా ఇప్పించండి. మిగతా వ్యవహారం తర్వాత మాట్లాడదాం" అని కన్నుకొట్టాడు నిర్మాతకు సలహా.

"అదా, సరేకానీ. కానీ, ఒక్క చనంలో ఇస్తాను. బ్యాంకు తియ్యాల" అన్నాడు నిర్మాత.

"సరే బ్రదర్— తీసుకో. కథకానీ ముందు—" అని కన్నుకొట్టాడు రచయితకు సలహా!

తాను రాసిన కథలలోంచి, ఒక కథను తీసి విపించాడు రచయిత.

"బావుంది. బట్, హేపీ ఎండింగ్ ఏది ?" న్నాడు సలహా.

"హేపీ కాకపోవటం ఏమిటండీ—చివరకు అంతా ఒనుకున్నారుగా" అన్నాను నేను.

"నోనోనోనో—మిస్టర్ ....వాటీజ్ యువర్ నేమ్, .... మహాశయ్! నా పాయింటు అదికాదు. ఎండింగు హేపీగా ఎప్పుడౌస్తుంది ? మధ్యలో చచ్చిన పాత్రలు చావగా, మిగతావన్నా చివరకు వచ్చినప్పుడే, వస్తుంది!"

"వచ్చాయికదా."

"నా టొటాల్. అక్కడే పొరబడుతున్నారు మీరు.

—49 వ పేజీ చూడండి





# ప్రపంచ ప్రముఖులు- 9

నేడు భారతదేశాన్ని సమైక్యపరుస్తున్న సాధనాలలో ఇంగ్లీషు భాష ముఖ్యమైనది. కాని, కొందరు రాజకీయనాయకులు తొందరపడి, అంతర్జాతీయభాష అయిన ఇంగ్లీషు బదులుగా హిందీని అధికారభాషగా ప్రవేశపెట్టాలని చూస్తున్నారు. కొన్ని సంవత్సరాల క్రితం ఈ ప్రయత్నాలు తీవ్రమయినప్పుడు శ్రీ చక్రవర్తి రాజగోపాలాచారి కృషివల్లనే ఇంగ్లీషు మనకు దక్కినదనటంలో అతిశయోక్తి లేదు. రాజాజీ జీవితంలో ముఖ్యమయినఘట్టాలు మరి రెండు— 1942 "క్విట్ ఇండియా" ఉద్యమాన్ని ప్రతిఘటించటం, పాకిస్తాన్ ఏర్పాటుకు తోడ్పటం,— పరిశీలిస్తే రాజకీయాలలో మార్పును ఎదుర్కొనటమే వీరిపాత్ర యేమో అనిపిస్తుంది. ప్రస్తుతం, ప్రతి రాజకీయపక్షంవారూ తామే సామ్యవాదులమని నిరూపించుకొనటానికి ప్రయత్నిస్తున్న సమయంలో 'స్వతంత్ర' పార్టీ నెలకొల్పి మత సంబంధంలేని మితవాదాలకు పునాది వేయటంతో, ఈ వ్యాఖ్య బలపడి నట్టే ఉంటుంది. కాని, ఈ వ్యాఖ్య సహృదయ పూర్వకమయినది కాదేమో! పదవిలో లేకపోయినా దేశంమీద వారి ప్రభావం ఇంత కనిపిస్తున్నప్పుడు అధికారంలో ఉంటే వీరు ఎంత సాధించేవారో అనిపిస్తుంది.

★



# వెండిమబ్బు

కన్నడమూలం: త్రివేణి
అనువాదం: శర్వాణి

### జరిగినకథ

'వెండిమబ్బు' యజమాని సదాశివరావుగారు, భార్య లలితమ్మగారి ప్రోద్బలం వల్ల తమ ఏకైక పుత్రిక ఇందిరను మోహనుడికిచ్చి వివాహం చెయ్యాలని నిశ్చయించి, పైచదువులకు అతణ్ణి అమెరికా పంపుతారు. మోహనుడు అమెరికా వెళ్ళిన కొద్ది కాలానికి లలితమ్మగారికి గిరిరాజు కలుగుతాడు. ఇందిర ఈ సంగతి తెల్పితే మోహనుడు పట్టీపట్టనట్టు సమాధానం వ్రాస్తాడు. మొదటే కీడు శంకించిన లలితమ్మగారు కూతురు పెళ్ళి చూడకుండానే దిగులుతో కన్నుమూస్తారు. పసికందు గిరిరాజుకు తల్లి లేనిలోటు తెలియకుండా ఇందిర పెంచుతూ ఉంటుంది. అమెరికా నుంచి తిరిగి వచ్చిన మోహనుడికి ఇందిరతో వివాహం తెగిపోని బంధంగా కనిపిస్తుంది. ఆమాటే దాచకుండా ఆమెకు చెబుతాడు.

(గతసంచిక తరువాయి)

ఇందిర కన్నీళ్ళు పెట్టుకుంటే తను ఎలా ఓదార్చాలో అతడు ముందే ఆలోచించాడు. కన్నీళ్ల పరంపర తనమీద వర్షిస్తే తన్ను ఎలా రక్షించుకోవాలో ఆలోచించుకున్నాడు. ఆమె జ్వాలాముఖిగా మారితే ఏ హిమవత్పర్వతాన్ని ఆమె ముందుంచాలా అని ఆలోచించాడు.

కాని ఇందిర నిర్వికారంగా శిలాబాలికలా కూర్చుంది.

"ఏమైనా చెప్పు ఇందిరా" — అని వేడుకున్నాడు మోహన్.

"చెప్పటాని కేమీ లేదు."

"అంటే అప్పుడు జరిగిన వాగ్దానంతో మనిద్దరం పరస్పరబంధితులమనేనా నీ అభిప్రాయం? మీ నాన్న నా చదువుకు డబ్బు ఖర్చుపెట్టారు నిజమే. కాని దాన్ని అప్పుకింద లెక్కవేసి నేను ఉద్యోగంలో చేరాక నెలకింత అని పంపించి అప్పు తీర్చివేయడానికి సిద్ధంగా ఉన్నాను. డబ్బుతో నన్ను ఎవ్వరూ కొనుక్కోలేరు. నేనేం కొట్లోని వస్తువునా కొనుక్కోవటానికి?"

మోహనుడు ఆమె భావనలను రెచ్చగొట్టి శాంతి సముద్రంనుండి బయటికి లాగటానికి పోటీ కొచ్చినట్లు వాగాడు.

ఇందిర.

"ఇప్పుడు మిమ్మల్ని కొనుక్కునేవాళ్లు ఎవరు?" అంది.

"నన్ను విడుదల చెయ్యి ఇందిరా. నా స్వాతం

— 40 వ పేజీ చూడండి

# భార్యాభర్తలమధ్య పొరపొచ్చాలు

'శారద'

పదేపదే ఉత్తరాలు వ్రాయగా, ఒకసారి మా పద్మ యింటికి వెళ్లటం జరిగింది! పద్మ, నేను హైస్కూల్లో చదివే రోజుల్నుంచీ క్లాసుమేట్సుం. నేను పి. యు. సి. తో ఆపవలసి వచ్చింది. అదేమో గ్రాడ్యుయేట్ అనిపించుకోగల్గింది! మా ఇద్దరి మధ్యా రహస్యాలంటే యెలాగుంటాయో యెరుగం. ఈసారి పద్మ ఉత్తరం కొంచెం నిష్ఠురోక్తులతో కూడి ఉండటం మూలాన, యెలాగో వీలుచేసుకుని వెళ్లాను. లోతుకుపోయిన కళ్ళు, కళావిహీనమైన ముఖం—పదిమంది పిల్లలనుగన్న తల్లిలా బాగా చిక్కిపోయి అందవిహీనంగా ఉన్న ఆమెను చూసి, పద్మేనా ఆమె ? అనిపించింది!

"ఎంత మారిపోయావు పద్మా! గుర్తుపట్టలేనంతగా మారిపోయావు. మా అన్నయ్యగారి పోషణ అంత బాగా ఉందన్నమాట! రానీ అడుగుతాను" అన్నాను.

పద్మ బరువుగా నిట్టూర్చి, తెచ్చిపెట్టుకున్న నవ్వుతో—"పోషణ ఉండగానే సరా? ఆప్యాయతలు కరువయ్యాక దేనికే బ్రతుకు ? ఆడది బ్రతకటానికి కోరుకునేవి అన్నం, నీళ్లేనా ? మనసును సంతోషపెట్టే చల్లని మాట, దాంపత్యంలో అన్యోన్యత లోపించాక ఏమి చూచుకుని బ్రతకాలీ—గానుగెద్దులా బరువుగా జీవితాన్ని ఈడ్చటం తప్ప."

ఎంతో బాధగా చెప్పి, నాముందు నిలబడలేక 'కాఫీ తెస్తా' నంటూ లోపలికి వెళ్లిన పద్మను చూస్తుంటే నాకు జాలేసింది! ఇద్దరూ చదువుకున్నవాళ్లే. అభ్యుదయభావాలు గలవారు. సంసారంలో స్త్రీబాధ్యత యెంతవరకో, దాంపత్యం యెలా సుఖమయం చేసికోవాలో—లాటి అనేక విషయాలమీద అనర్గళంగా మాట్లాడి కాలేజీలో మంచి వక్త అనిపించుకున్న మా పద్మకాపురంలో పొరపొచ్చాలా ? ఆశ్చర్యపోయాను. ఒకవేళ అలాటివేమైనా ఉన్నా సమర్థించుకోలేనితెలివితక్కువదేం కాదు. అమాటే కాఫీ త్రాగుతూఅడిగాను.

"నేను ఒకటంటే ఆయ నింకో టంటారు. ఎప్పుడూ మా ఇద్దరి అభిప్రాయాలు కలవ్వు. మాటా మాటా పెరగటం, భోజనం చేస్తూ చేస్తూ లేచి వెళ్లిపోవటం, ఒక్కోసారి రెంత బ్రతిమాలినా రాకుండా పస్తులుపడుకోవడం—మామూలైపోయింది. అయినా, నా తెలివితక్కువగాని— ఒక తల్లికి పుట్టిన పిల్లల అభిప్రాయాల్లోనే ఎంతో వైరుధ్యం కన్పిస్తూంటే—ఇక భార్యాభర్తల విషయం వేరే చెప్పాలిటే ?" అంది.

మాటల్లో మరోవిషయంకూడా చెప్పింది. "ఏ చదువుకోని మొద్దునో చేసుకుని ఉంటే—అది 'డూ డూ బసవన్న' లా నేను చెప్పినట్లు నడచుకునేది. నిన్ను చేసుకోవటం తప్పయి పోయింద" ని కూడా వాళ్లాయన అప్పుడప్పుడు పోధిస్తూ ఉంటాడట! 'పోనీ ఆ తలాడించేవని నీవే చేయరాదుటే' అంటే 'నాకేం ఖర్మం! చెప్పినదానికల్లా తలాడిస్తానికి నేనేం గంగిరెద్దును కాను. నేనూ చదువుకున్నాను" అంది. భార్య ఎంత చదువుకున్నదైతే మాత్రం భర్త చెప్పినట్లు నడచుకోవటం తప్పా ? అది హైందవస్త్రీ ధర్మం కాదా ? అలా నడచుకుంటే వాళ్ల కాపురం మూడు పూవులూ ఆరు కాయలుగా మారి అందరి మన్ననలకు పాత్రమై వాళ్ల దాంపత్యం ఆదర్శప్రాయమవుతుందే గాని—భర్తమాట వినటం న్యూనతగా భావించే ఈ (అ) విద్యావంతులైన స్త్రీల నేమనాలి ? అది వాళ్ల తెలివితక్కువ కాదూ ? భార్యమాట భర్తయినా వినాలి. అదివాళ్ళ అదృష్టమనుకోండి. భర్తమాట భార్య అయినా వినాలి. ఇక్కడే వస్తుంది చిక్కు. ఎవరో ఒకరు మరొకరిమాట వినక తప్పదుకదా! ఎక్కువ తక్కువలు పాటిస్తూ కూచుంటే కాపురాలు నిలుస్తాయా ? భార్యాభర్తలు—దాంపత్యశకటానికి రెండు చక్రాలు. ఏచక్రం గొప్పదంటే ఎవరు చెప్పగలరు ? అందులో ఏ చక్రం లేకపోయినా, లేక కుంటుపడినా బండి నడవటాని కవకాశం లేదు. ఈవిషయం మనసులో ఉంచుకుని, చదువుకున్న అమ్మాయిలు తమ విజ్ఞానాన్ని, సంసారాన్ని కళాత్మకంగా రూపొందించుకోవటంలో వినియోగిస్తే ఎంత బావుంటుంది? తల్లి చదువుకున్నదైతే—పిల్లల చదువులవిషయంలో తగుజాగ్రత్త తీసుకోవచ్చు!

అసలు భార్యాభర్తలమధ్య పొరపులెందుకు వస్తాయి ? అనే ప్రశ్నకు చక్కని సమాధానమిచ్చింది పద్మ. ఒకతల్లికి పుట్టిన బిడ్డలే ఒక రకంగా ఉండరుకదా—ఇహ భార్యాభర్తల అభిప్రాయాల్లో కలయికెలా సంభవమని ? నిజమే! అందరి మనస్తత్వాలూ ఒకేమాదిరి ఉండవు. భార్యాభర్తలు — రెండు విభిన్నమనస్తత్వాలుగల వ్యక్తులు. కాని దాంపత్యం ? బండికి యిరుసు ఎలాటిదో అటువంటి దీ దాంపత్యం. వాళ్ల అభిప్రాయాల్లో ఏకీభావం, సమన్వయం సాధ్యమైనపుడే, ఆ యిరుసు ధృడంగా ఉంటుంది. అలాకాక, ఉభయుల అభిప్రాయాల్లో వైరుధ్యం కనబడితే, ఆ యిరుసుబలంకూడా తగ్గి, బండి ముందుకు సాగదు. అంటే వారి దాంపత్యం సుఖమయంగా పురోగమించదు. అమృతకలశంవంటి సంసారాన్ని చేతులారా కాలదన్నుకోవటంకన్నా తెలివితక్కువపని మరొకటి ఉందా ?....

'ఒకరి మాట మరొక రెందుకు వినాలి ?' అనే కారణంచేతగాక ఈ పొరపులు మరో కారణంచేత కూడా వస్తుంటాయి. సాధారణంగా ప్రతి యువకుడూ, యువతీ తన కెలాటి భార్యా లేక భర్త కావాలో ముందే ఊహించుకుని కొన్ని నిర్ణయాలకు రావటం సహజం. పెళ్లయ్యాక ఆ భార్యలో లేక భర్తలో తా నిదివరలో ఊహించి కలలుకన్న గుణాలు లోపించటంతో ఒకవిధమైన నిరాశ, నిస్పృహ జనిస్తాయి మొదట్లో! ఆ నిరాశ, నిస్పృహ క్రమంగా పెరిగి ఒకరిని చూస్తే మరొకరు అసహ్యించుకునేవరకూ వెళ్తుంది! ఒకరిమీద మరొకరికి ప్రేమ క్షీణించి వాళ్ల సంభాషణల్లో యెత్తిపొడుపులు, సాధింపులు అంతరిస్తుంటాయి. సౌందర్యవతి, అపురూపలావణ్యవతి అయిన భార్య కావాలనుకున్న భర్తకు కురూపి అయిన భార్య లభ్యమైనప్పుడు, ఆ విషయం మాటల్లో గుర్తుకు తెచ్చి పదేపదే ఎత్తిపొడుస్తూంటాడు భర్త! చదువుకోలేదని, కురూపి అని ఆమెను హింసించేదానికన్నా ఆమె హృదయసౌందర్యం యెందుకు చూడగూడదూ ? ఆమాత్రం గమనించలేని భర్త చదువూ సంస్కారమూ దేనికి ? మట్టిలో కలపనా ? .... పెళ్లిచేసుకునేటప్పుడు తనకు తెలియదా ఆ విషయం ? తీరా పెళ్లి అయ్యాక ఆ విషయాన్ని జ్ఞప్తికితెచ్చి ఆమె మనస్సును చిత్రవధ చేసేకన్నా, ఆమె హృదయసౌందర్యాన్ని ఆకళింపుజేసుకుని లాలనతో, చేరదీస్తే ఆమె యెంత ఉప్పొంగిపోతుంది ? గృహిణి ఆనందంగా ఉంటేనే కదా గృహము కళకళ లాడేది ? .... అయితే తప్పంతా మగవారిది అనటం కూడా భావ్యంకాదు. ఆఫీసులో పనిచేసి వచ్చిన భర్తకు చిరాకుకల్గించే ధోరణిలో ప్రవర్తించే గృహిణులూ ఉన్నారు మనలో చాలామంది! ఫైల్సుతో విసిగి యింటికి వచ్చిన భర్త కోరేది — రాగానే భార్య చిరునవ్వుతో దర్శనమివ్వడం! స్నానానికి నీళ్ళ తోడి, టవల్ అందించి, నాలుగు అనునయవాక్కులు, ప్రేమపూరిత చూపులు ప్రదర్శిస్తే ఇల్లాలి సొమ్మేం పోయింది ? అతను తృప్తిపడతాడు కదా ? ఈ కీలకం తెలియకనో, తెలిసీ 'ఆ పోదూ' అనో అశ్రద్ధచేస్తే ఆడవాళ్లమీద మగవారికి కోపం వస్తుందంటే రాదూ మరి ? ....

భర్త అనేవాడి నొకణ్ణి కట్టుకున్నతర్వాత అతని అడుగుజాడల్లో భార్య నడవటం మన ధర్మం! భర్త కిష్టమయినవి, భార్య కిష్టములేనివి కొన్ని కొన్ని పనులు చేయవలసి రావచ్చు! అటువంటి సమయాల్లో భార్య తన ఆశయాలకు, అభిరుచులకు స్వస్తిచెప్పగల 'త్యాగం' ఆమెలో ఉంటేనేతప్ప ఆ కాపురం పొరపులు లేకుండా సాగటాని కవకాశం లేదు. భర్త అభిరుచులకూ, తన అభిరుచులకూ తేడా ఉన్నప్పుడు, తన అభిరుచులకు, ఆశయాలకూ స్వస్తిచెప్పే 'త్యాగం' భర్త అభిరుచుల కనుగుణంగా సర్దుకుపోయే నేర్పూ, ఓర్పూ ఆ గృహిణి కుండటం చాలా అవసరం. ఈ చిన్న సూత్రాన్ని విస్మరించినపుడే భార్యాభర్తల మధ్య పొరపులు వస్తుంటాయి.



# వ ని తా వా ణి

## పెళ్లి సంబంధాలూ—పెద్దలూ

పెళ్ళిసంబంధాలకోసము వచ్చేవారు వినయ విధేయతలతో మర్యాదపూర్వకంగా ఎన్ని ప్రశ్నలు వేసినా బావుంటుంది. కాని మనలో కొంతమంది మావాళ్లే గొప్ప నాగరికులు అని గర్వంగా హాస్య ధోరణిలో ప్రశ్నిస్తారు. ఇటువంటివారిని ఏమనాలో తెలియదు. ఎవరికివారు ఇటువంటి విషయాలు తెలుసుకోవాలిగాని, ఒకరితో అనిపించుకోవలసిన అవసరములేదు.

జాస్తి కృష్ణవేణి, శేషగిరి (తాపేశ్వరము)

*  *  *

యల్. కె. రత్నమాలగారు వ్రాసిన "పెళ్ళి సంబంధాలూ—పెద్దలూ" అనే వ్యాసం ఆమూలాగ్రంగా చదివేను. వనితాలోకము శీర్షిక సమంజసమైన లోపాలను విమర్శించడానికేగాని, ఇంకొకరి ఉద్దేశాలను (సమంజసమైనవాటిని) త్రుంచివేయడానికి గాదు. ఈ విషయంలో రత్నమాలగారు పొరపాటు పడ్డారు. వారు కట్నాలకి సంబంధించినది వ్రాయునప్పుడు, పద్మగార్ని ఎందుకు విమర్శించారో అర్థం గాలేదు. చుట్టాలింటికి, వెళ్ళడానికి పెద్ద అభిమానమే కావాలేమిటి? స్వల్పపరిచయానికి గూడా వెళతారు చాలామంది. మరొక విషయమేమిటంటే సంబంధము కుదరనంతమాత్రాన కసినంతా వ్రెళ్ళగక్కరు. వారు ఇలాటివాటి నెన్నిటినో ఎదుర్కొని విసిగి ఉండవచ్చు. ఏదైన అనుభవముమీదగాని తెలియదు. లోకంలో ఎదుర్కొనే క్లిష్టపరిస్థితుల్ని అవగాహనచేసుకొని, అనుభవించి గూడ పద్మగారు వ్రాయవచ్చు. అంతమాత్రాన విమర్శించడము న్యాయముగాదు. వ్యాసాలూ, కథలు వ్రాసేవారు కేవలము యువతులేగాదు. యువకులుగూడ సాటిలేని ఉత్కృష్టమైన రచనలు సాగిస్తున్నారు. వారు కేవలము తాము చిత్రించిన కథకు ఉదాత్తత కల్పిస్తూ, సంఘసేవ చేస్తున్నారనిగాని, వారిదృష్టిలో ప్రజలంతా తమ రచనతో మారుతారనిగాదు. పద్మగారు కట్నాలగురించి అడిగేవారినే విమర్శించారుగాని, అడగనివారి విషయమ్మై వ్రాయలేదు. అటువంటప్పుడు ఆ విధము అపార్థం చేసుకున్నారు రత్నమాలగారు. ఎవ్వరు ఏమనుకోకపోతే చిన్నమాట. రచయిత్రిగార్కి పెళ్ళి కాకపోతే ఫరవాలేదుగాని, అయితేమాట. వార్ని వారి భర్తగారు రెండడుగులు నడవమని, ఏదైనా చదవమని ఇత్యాది ప్రశ్నలడిగే చేసుకున్నారనుకుంటాము. తీరా అన్నిహంగులుఉన్న ఆమె పెళ్ళికి కుదురుతే వారి తమ్ముడికి చేసుకుంటారనుకుంటాము. అయితే ఆమె 'సుగుణముతో' ప్రమేయము లేదంటారు. నా మటుకు ఎవరి భావాలు వారివి. ఒకరి భావాల్ని ఒకరు త్రుంచగూడదు. ఒకరి వ్యాసాన్ని మరొకరు విమర్శించారుగాబట్టి నేను వారిని విమర్శించవలసి వచ్చింది. క్షమించవలెను. ★

దేవగుప్తాపు సూర్యకుమారి (హన్మకొండ)

ఇదీవరస—5

సుందర్












తెలుగు పత్రికలన్నింటిలోనూ ఆంధ్రసచిత్ర వారపత్రిక
సర్క్యులేషన్ అత్యధికమైనది.

## పగిలిన గ్లాసు మీ పిక్‌నిక్‌ని నిరుత్సాహ పరచనక్కర్లేదు



### బర్నాల్ పూయండి

మీ రెంతో సరదాగా వుంటారు. బర్నాల్ మీకు శీఘ్రోపశమనము కలిగించి,- గుణమునిచ్చును. కాటులకు, కాల్పులకు, చిన్న పురుగులు కుట్టుటకు, ఎ్రబా పన్లకు బర్నాల్ ఆదర్శమైన యాంటి సెప్టిక్ పూతమందు.

మీరు మరల పిక్‌నిక్‌లకుగాని, ప్రయాణాలకుగాని వెళ్లునప్పుడు ఒక బర్నాల్ ట్యూబుని తీసుకువెళ్లండి – మీకు దాని అవసరం వుండవచ్చును.




# బర్నాల్

ఆదర్శమైన యాంటిసెప్టిక్ పూత మందు-
20 సం॥లకు పైబడి ప్రఖ్యాతిగాంచినది.

ఫెనాక్స్, గ్రైమిక్స్ తయారుచేయు Boots
బూట్స్‌వారి శ్రేష్ఠమైన తయారు

**ఉచితము** మీరుకొనే ప్రతీ బర్నాల్ ట్యూబుతోను ఒక అందమైన అడుగుబద్ద ఖువ్వబడును.

NATIONAL BB-161

# హంతకుని అస్త్రాలు

నార్మన్ అబట్

నేరస్థులను జైళ్లలో వివిధంగా చూడాలి అనే విషయమై జరిగే వాదవివాదాలకు అంతులేదనిపిస్తుంది! కొందరు నేరం చేసిన వారందరూ రాక్షసులు కాబట్టి కారాగృహవాసం శిక్షగా అనుభవించాలంటారు. మరికొందరు, నేరాలు చేసేవారు మానసికంగా స్థిమితంలేని వారు కాబట్టి జైళ్ళు పిచ్చి ఆస్పత్రులవంటివి అని వాదిస్తారు.

అరవై సంవత్సరాల క్రితం పిట్స్‌బర్గ్ (పెన్‌సిల్వేనియా రాష్ట్రం) నగరంలోని అల్లెగెనీ జైలులో మరణ దండనకోసం ఎదురుచూస్తున్న ఎడ్‌బిడిల్, అతని సోదరుడు జక్‌బిడిల్‌లను చూడటానికి కేథరిన్ స్కాఫెల్ వెళ్ళినప్పటినుంచి నేటివరకూ నేరస్థులను ఇంత దయతో చూడడం జరగలేదనిపిస్తుంది. అసలు ఒక కారాగృహవాసిని ఇంతగా ఎవరూ ముద్దు చేసి ఉండరు.

చాలాకాలం క్రితం జరిగినా, రికార్డులు స్పష్టంగానే ఉన్నాయి. శ్రీమతి స్కాఫెల్ పెద్ద మత సంస్కరణవాది. ఉరిశిక్ష ఎదురుచూస్తున్న ఈ హంతక సోదరులలో పెద్దవానిని చూసి, గాఢంగా ప్రేమించింది.

ఇద్దరూ జైలునుంచి తప్పించుకొని పోవటానికి ఆమె ఒక పెద్ద 'ప్లాను' వేసింది. వారిద్దరితోనూ పారిపోయి, చనిపోయినంత పని అయింది.

అసలు కాథరిన్‌స్కాఫెల్ వారిని కలుసుకునే అవకాశం ఏమిటి? ఆమె జైలువార్డెన్ భార్య.

## హత్య

పిట్స్‌బర్గ్ నివాసులైన బిడిల్ సోదరులు 29 మార్చి 1901 ప్రొద్దున ఒక హత్య చేసినట్లు నిర్ధారణ అయింది.

జాన్ కహ్నీకి ఆ ఊరిలో ఒక అంగడి ఉండేది. అంగడిపై భాగంలోనే ఇల్లుకూడా ఉండేది. అర్ధరాత్రితర్వాత కొంతకాలానికి కింద ఏదో అలికిడి విని మేలుకువచ్చి కహ్నీ మెట్లు దిగి వెళ్ళాడు. ఇద్దరు మనుష్యులు అంగడిసామాను దోపిడీ చేస్తున్నారు. వారిలో ఒకడు అతనిని తుపాకితో కాల్చి చంపేశాడు. తర్వాత దొంగలిద్దరూ అటే వెడుతున్న ఒక 'ట్రామ్' బండి ఎక్కి పారిపోయారు.

డిటెక్టివ్ పాట్రిక్ ఫిట్‌జ్ జరాల్డ్ పరీక్షచేసి నేరస్థులు బిడిల్‌సోదరులే అయిఉండాలని నిశ్చయించాడు. ఎందుచేతనంటే, వీరిద్దరూ అంగడి బయట తిరిగెత్తుతూ ఉండటం కొందరు గమనించారు. అంతేకాక, తలుపులో కన్నం చెయ్యటానికి ఉపయోగించిన పరికరం దొంగతనంచేసినచోట మర్చిపోయారు.

ఈ పరికరమే వారి మృత్యువుకి పరికరం అయింది. వారిదేకాక, ఫిట్ జ్ జరాల్డ్‌దికూడా. అదే సాయంత్రం వారిని తరుముకుని వెళ్ళిన ఈ డిటెక్టివ్‌తో పోట్లాడి అతనిని తుపాకితో కాల్చి చంపేశారు బిడిల్ సోదరులు.



విచారణ జనవరి 1902 కిగాని పూర్తికాలేదు. బిడిల్ సోదరు లిద్దరికీ ఉరిశిక్ష విధించారు.

జైలు వార్డెన్ పీటర్ స్కాఫెల్ వయస్సు ఏభైపైన ఉంటుంది. అతనిభార్య అతనికన్నా ఇరవై సంవత్సరాలు చిన్న. ఆమెకి పదహారు సంవత్సరాలుండగా పీటర్ స్కాఫెల్‌ని పెళ్ళిచేసుకుంది. ఇది ఇరవై సంవత్సరాల మునుపటిమాట. వారి పిల్లలు కూడా ఎదిగారు. కేథరీన్‌స్కాఫెల్‌కి మతప్రచారం మీద మనస్సుపోయి, జైలులోని బందీలకు హిత బోధ చెయ్యటం ప్రారంభించింది.

క్రమంగా కేథరిన్ జైలులో మరొక అధికారి కింద తయారయింది. బిడిల్‌సోదరుల ఉరిశిక్ష 14—2—1902 వ తేదీ నిశ్చయించారు. జాక్ బిడిల్‌అన్న ఎడ్‌ని ఈమె కలుసుకుని ప్రేమించిందని ఇంతకుముందే చెప్పాము.

## బయటపడని రహస్యం

ఈ ముగ్గురిలో చావకుండా మిగిలిన వ్యక్తి అసలు నోరు విప్పి నిజం చెప్పలేదు. కొన్ని విషయాలు మనం ఊహించవలసిందే!

బిడిల్ ఫోటో పరిశీలిస్తే, మంచి పొడగరి, అందగాడు అని తెలిసిపోతుంది. నాటకాలలో వేస్తే పెద్ద నాయకుడై ఉండేవాడేమో! అదికాక, సాహసికులంటే స్త్రీల కెప్పుడూ వ్యామోహం అన్నది లోక సామాన్యం.

తక్కిన జైలు అధికారులు కొందరు తమ సాక్ష్యంలో కాథరిన్ మతప్రచారంలోతప్ప వేరే

—44 పేజీ చూడండి


శ్రీ ఏ. ఆర్. సబ్నవీస్
బొంబాయి





శ్రీ ఏ. వి. యస్. యన్. మూర్తి
కాకరపర్రు, ప.గో. జిల్లా

# సువర్ణగ్రంథం

ఇంటింటా స్వంత గ్రంథాలయం ప్రణాళిక
సభ్యులు 4,400 లోనూ
800 మంది 18 నెలల పూర్తి చందాకట్టి
తమ ఇండ్ల చక్కటి స్వంత గ్రంథాలయాలు
నెలకొల్పుకున్నారు.
మా సువర్ణ గ్రంథం అలంకరించిన
ఈ 800 సభ్యులలో
8 మందిని ఇక్కడ చూడవచ్చును.
స్వంత గ్రంథాలయం నెలకొల్పుకుందికి
వీరికి అయిన ఖర్చు
రోజుకి 20 నయాపైసలు లోపే!


శ్రీ రాజా జగన్నాధరావు
సికింద్రాబాదు


శ్రీ కె. వి. రాఘవయ్య
బేతపూడి, గుంటూరు జిల్లా


శ్రీ వి. విశ్వనాథం
పిప్పర, ప.గో. జిల్లా


శ్రీ వై. సూర్యనారాయణమూర్తి
తణుకు

కొత్తగా చేరే సభ్యులకు
ప్రత్యేక బహుమానం


శ్రీమతి వి. కల్పలతారెడ్డి
ఎర్రకోటపల్లి, చిత్తూరు జిల్లా


శ్రీమతి రామలక్ష్మిఆరుద్ర
మద్రాసు

## ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్

పుస్తక ప్రచురణలో 38 ఏండ్ల అనుభవంగల ఎం. శేషాచలం అండ్ కంపెనీ వారి నిర్వహణ

ఇంటింటా స్వంత గ్రంథాలయం ప్రణాళిక వల్ల
మీకు కలిగే సదుపాయాల గురించి తెలుసుకోండి

# మీకు ఉచితంగా లభించే మొదటి మూడు పుస్తకాలనూ ఈ క్రింది 8 నుంచి ఏరుకోవచ్చు

**F 6** పౌరుడు - రాజ్యాంగము
ప్రతి పౌరుడూ తెలుసుకొనవలసిన విషయాలు

**F 7** ముళ్ళపూడి వెంకటరమణ కథలు
ఆంధ్రుల అభిమాన హాస్యరచయిత కథల సంపుటి

**F 8** కథ-1
చిన్న కథలకు నిర్వచనాలనదగ్గ పదకొండు మంచి కథల సంపుటి
కూర్పు: బాపు

**F 14** పులుల సత్యాగ్రహం
కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారి నవల

**F 15** ఆశాప్రియ
ప్రఖ్యాత రచయిత శ్రీ బుచ్చిబాబుగారి నవల

**F 18** తల్లి - బిడ్డ
పసిబిడ్డల పెంపకంలో తల్లి బాధ్యతల గురించి
శ్రీమతి దర్శి సుభద్రమ్మగారి వివరణ

**F 22** ఆణిముత్యం
ఐశ్వర్యం ప్రసాదించకపోగా ఒక సంసారాన్ని పుట్టి ముంచి
తానూ మున్నీటి పాలైన ఆణిముత్యం కథ -
శ్రీమతి ఆరుద్ర తెనిగింపు

**F 23** బాలరాజు
పిల్లలకి వినోదం, పెద్దలకు విజ్ఞానం కలిగించే కథలు
ఆస్కార్ వైల్డ్ రచన - బాపు బొమ్మలు
శ్రీ నండూరి రామమోహనరావుగారి తెనిగింపు




## ఆంధ్ర సాహిత్య ప్రపంచానికి అత్యుత్తమ దర్పణం

ఉత్తమశ్రేణి కథలతో గేయాలతో వ్యాసాలతో ఆబాలగోపాలానికి వికాసం కలిగించే పుస్తక ప్రియుల పత్రిక

# పుస్తక ప్రపంచం

వీటన్నిటితోపాటు తెలుగు సాహితీ ప్రపంచంలో వెలువడే ప్రతి కొత్త పుస్తకాన్ని మీకు చూపిస్తుంది మీరు శ్రమ పడకుండా,
ఇంటికి తెప్పించుకుని మీ స్వంత గ్రంథాలయాన్ని అలంకరించుకునే మార్గం చూపుతుంది
కుటుంబంలో ఎవరెవరి అభిరుచులకు ఏ పుస్తకంతగునో సూచిస్తుంది - అందిస్తుంది

సాలు చందా (12 సంచికలు) 5 రూపాయలు

"ఇంటింటా స్వంత గ్రంథాలయం" ప్రణాళిక చందాదార్లకు

# ఉచితం

## ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్ రాష్ట్రపతి రోడ్ సికింద్రాబాద్

పుస్తక ప్రచురణలో 38 ఏండ్ల అనుభవంగల ఎం. శేషాచలం అండ్ కంపెనీ వారి నిర్వహణ

# నేడే చందాదారులుగా చేరండి!

మీరు కట్టేది 90 రూ॥లే
అదీ తేలిక వాయిదాలలో

| మీకు వచ్చేది | కలిసొచ్చేది |
|---|---|
| మీరు ఏరి కోరుకునే | |
| 100 రూ॥ల మంచి పుస్తకాలు | రు 10.00 |
| 10 ఉచిత పుస్తకాలు | రు 17.00 |
| పుస్తక ప్రపంచం 18 సంచికలు | రు 7.50 |
| ఉచిత పోస్టేజి | రు 5.00 |
| పెద్ద కేటలాగు పుస్తకం | రు. 1.50 |
| మీకొచ్చే లాభం | రు 41.00 |

ప్రణాళిక ద్వితీయ వార్షికోత్సవ సందర్భంలో
1962 సెప్టెంబరు 5 తేదీలోగా చేరే చందాదార్లకు

**ఉచితం**

మహాభారత వచన రచనతో మహాంధ్రమంతటా పేరుమోగిన
శ్రీ గణపతిశాస్త్రిగారి కలంకారితవం!
పురాతన సారస్వతాలలోని చిన్నచిన్న సన్నివేశాలు, సంఘటనలు,
వినూత్న కల్పనలతో రమణీయంగా రూపొందిన కథల సంపుటాలు

ప్రాచీన గాథాలహరి 1 వ భాగం
ప్రాచీన గాథాలహరి 2 వ భాగం

మీరు కోరుకునే ఒక సంపుటం పంపుతాం




18 నెలల చందా పూర్తి చేస్తే

## యావజ్జీవిత సదుపాయాలు

యావజ్జీవితమూ మా పంపిణీ పుస్తకాలన్నిటిపైనా 10% కమిషన్
రూ 20 లకు పైబడ్డ ఆర్డర్లకు అదనంగా రవాణా ప్యాకింగులు ఉచితం
అవసరమైనప్పుడు రూ 50 లకు మించకుండా నెలరోజుల అరువు
"పుస్తక ప్రపంచం" చందాలో కూడా 10% తగ్గింపు
ఉత్తరోత్తరా వచ్చే పెద్దా, చిన్నా కేటలాగులన్నీ ఉచితం
ఆంధ్రలో మంచి గ్రంథాలయాలు ఇంట కలవారి పేర్లు, ఛాయా చిత్రాలతో పలువురికి
ఉపయోగించగల విధంగా తీర్చిదిద్దిన సువర్ణ గ్రంథంలో మీ పేరు చేరుస్తాం

ఇప్పుడే ఈ కూపన్
కత్తిరించి, పూర్తిచేసి
మాకు పంపండి
ఆంధ్రప్రదేశ్
బుక్ డిస్ట్రిబ్యూటర్స్
రాష్ట్రపతి రోడ్
సికింద్రాబాద్

ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్

"ఇంటింటా స్వంత గ్రంథాలయం" ప్రణాళికకు నన్ను చందాదారునిగా చేర్చుకోవలసింది మొదటి నెల చందా రు 5/- మనియార్డరు ద్వారా పంపుతున్నాను తొలి విడత ఉచిత పుస్తకాలు మూడూ ఈ కింద *గుర్తించిన నంబర్లవి పంపగోరతాను మీ నిబంధనలకు బద్ధుణ్ణి [* అక్కరలేని నంబర్లు కొట్టివేయండి]

F 6 F 7 F 8 F 14 F 15 F 18 F 22 F 23

పేరు

చిరునామా

ఊరు తేది

APX

ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్ రాష్ట్రపతి రోడ్ సికింద్రాబాద్





## ప్రే మ లే ఖ

ప్రై డియర్ పత్రికా రాణీ!

నీకోసం ప్రతివారం నిరీక్షిస్తూ నాకళ్లు
ాయలు కాస్తున్నాయి. అయినా నీ దివ్య
ర్శనం నాకు వారానికి ఒక్కసారే
లభిస్తుంది. ఆ వారంలో కూడా, ఒక్క
ోజువచ్చి నా జీవితంలో ఒక్కసారి తళు
క్కున మెరసి మాయమయిపోతావు.
ెల్పు! నాబాధ నీకెలా వ్యక్తపరచాలి.
ెప్పు! వారం రోజులవరకు నిన్ను చూడ
ండా ఎలా వుండగలను! అసాధ్యం...!
ాపైన కరుణించి కనీసం మూడురోజుల
ొకసారైనా వచ్చి, నా జీవితాన్ని ధన్యం
చేయవూ! నీ గురించి ఆలోచించి, ఆలో
చించి, నా బుర్ర క్లియర్ అయింది.
చూడు...నా హృదయం వీణ. నీ అల
స్యాన్ని భరించలేక...ఎలా అలమటిస్తూ
పాటపాడుతుందో...విను...

ఓ...పత్రికారాణీ...నను మరువకో చెలీ
నిరతమ్ము మదిలో...నీపైనె ధ్యానం ఓ!

కురూరి కె. మీనావిజయ్ (బాపట్ల.)

* * *

## నే నా ?

బోనులో సాక్షి ఏ ప్రశ్న వేసినా "నేనా?" అని అడిగి విసిగెత్తించేస్తున్నాడు.

ప్రాసిక్యూషన్ న్యాయవాది "అంటే, సోమవారం, జూన్ నాలుగవ తేదీని రామయ్య వీధిలో నుంచుని ఉన్నారా?" అని అడగ్గానే,

"నేనా?" అనేవాడు.

"సోమప్పగారితో మాట్లాడారా?" అంటే;

"నేనా?" అని ఎదురుప్రశ్న వేసి మరీ జవాబు చెప్పేవాడు.

ఇలా కొంతసేపు సాగిన తర్వాత న్యాయవాది జడ్జీవైపు



తిరిగి, "యువర్ ఆనర్! సాక్షితో ప్రతిప్రశ్నా ఆయనను ఉద్దేశించి అడిగినదే కాబట్టి "నేనా" అని ఎదురు ప్రశ్న వెయ్యొద్దని చెప్పండి!" అని అడిగాడు.

"అవును. 'నేనా' అని ఎదురు ప్రశ్న వెయ్యకండి!" అని సాక్షిని జడ్జిగారు మందలించారు.

సాక్షికి రోషం వచ్చింది. నాకీ కోర్టు లంటేనే భయం! నన్నిలా హడలగొట్టే ఎలా ?"

"నేనా!" అన్నారు గబుక్కున జడ్జీగారు.

సారధి (ఏలూరు)

* * *

## నశ్యదేవి

శ్రీమన్మహా నశ్యదేవీ మహోత్కృష్టమా నీదు సౌగంధ మాఘ్రాణముంజేసి స్వర్లోక సౌఖ్యంబులన్ పొందగాగోరి నిశ్చిత్తపు ధ్యానించి ఆలోచనా మగ్నమానస్కులైనట్టి భక్తకోటిన్ కటాక్షించి రక్షించవే! ఎల్లకాలంబు నీవిచ్చు సౌఖ్యంబు మూలంబునన్ గాదెయున్నెప్పుడున్ ఎచ్చటన్ చూచుకోనట్టి శ్యక్తుల్ మహాసాన్నిహిత్యంబుతో జీవితాంతంబు స్నేహంబుగా నుండి నీ సేవలో ముని నీ నామ మంత్రంబునే ఎప్పుడున్ తప్పకన్ మానసంబందునన్ నిల్పియున్నారు! నీ జన్మవృత్తాంత మింతో పవిత్రమ్ముగా వింతుమున్ వైనతేయుండు స్వర్గంబునందుండి అమృతంబు గొంతేర సందోక్కచే బిందు వీ భూమిపై వ్రాలనచ్చోటనే వృక్షరాజంబు జన్మించె తద్వృక్షపత్రమ్ముగాదే భవన్మాతృరూపంబు భస్మంబుగాయున్న నీదివ్యరూపంబు పొట్లాలు, డబ్బీలు, డబ్బాలలోనుంచి పూజింతు రీభూమివాసుల్ మనంబందు ఆలోచనల్ పోక, ఆనందమే లేక ఆందోళనా యత్తచిత్తంబుతోనున్న వారల్ నినున్ ఒక్క పర్యాయ మాఘ్రాణముంజేసి కనిం మహోత్సాహ మోహమ్ముతో నుండరే బాధలున్ బోవ నీవిచ్చు సౌఖ్యంబు బ్రహ్మాదిదేవుల్ దయంగూర్తురే నశ్యదేవీ! నమస్తే! నమస్తే...!

ఎ. వి. ఎస్. రావు (విశాఖపట్నం)

* * *

## 'గుమస్తా'

నేను 'గుమస్తా'ని!
ప్రభుత్వయంత్రాంగానికి సమస్తాన్ని




నాకుటుంబ జీవనయానానికి 'రస్తా'ని!
ఆఫీసర్ల దూషణలు
భూషణాలుగా ధరిస్తాను
అరువిచ్చిన షావుకారుకు
నా పరువును ధారపోస్తాను!
జీతాలు పెంచారని తెలిసి
ఆకాశమంత పొంగిపోతాను
బజారులో ధర వరలు చూసి
పాతాళానికి కృంగిపోతాను!
'ఫస్టు' తారీఖు నాకు పండుగ రోజు
అప్పులాళ్లకు నేనానాడు మహారాజు
చినిగిపోయిన 'కోటు' నాకు 'స్థిరాస్తి'
భార్య+తొమ్మండుగురు పిల్లలు
'చరాస్తి'!

అల్లెన దుర్గారావు (శ్రీకాకుళం)

* * *

"నాకు మీరు ఐదు రూపాయలు ఇవ్వాలి మర్చిపోయారా?"

"అప్పుడే మరువా! ఇంకా కొన్నాళ్ళు నడవనివ్వండి."

పి. రంగారావు (విజయవాడ)

## కాబోయే పాఠకులకు పనికొచ్చే చిట్కాలు

పత్రికలు చదువుదామనుకుంటున్నారా? చదవండి (కాని నమ్మకండి)! మీకు పనికొచ్చే చిట్కాలుకొన్ని—.

1. కథలు చదవాలనుంటే బొమ్మలున్న పేజీలకోసం వెతకండి. కావుంటే పూర్తిగ చదవండి! విసుగేస్తే మధ్యలో మానేయండి......

2. వ్యాసాలు—అంటే వనితాలోకంలోనివి-చదివితే మీకున్న దురుణాలు (అసలుంటే) పోగొట్టుకోవచ్చు. (అని రచయిత్రులు వ్రాస్తారు. వనితావాణిలో ఉద్ఘాటిస్తారు.)

3. మీకు మరీ సంతోషంగా ఉంటే అక్కడక్కడ కనిపించే 'జోక్సు' చదవండి. సంతోషమంతా ఇట్టే మాయమవుతుంది. (హామేషా విచారానికి ఇది ఖచ్చితమైన చిట్కా.)

4. మీ భాష, శైలి అభివృద్ధి చేసుకోవాలనుకుంటున్నారా? ప్రకటనలు చదవండి- ఇంగ్లీషు, తెలుగూ రెండిటిమీదా అసహ్యం పుట్టినా అధైర్యపడకుండా చదవండి!

5. ఈ చిట్కాలన్నీ వృథా అనిపిస్తే మంచి చిట్కా ఒకటి—పత్రికలు చదవకండి, బొమ్మలుమాని ఊరుకోండి! ★

వి. వి. (తుని)

# మనము - మన దేహస్థితి

డా॥ గాలి బాలసుందరరావు

## జఠరాశయము : రిఫ్లెక్సులు

(గత సంచిక తరువాయి)

పేరాసింపతెటిక్ భాగము, వెన్ను భాగములకు సంబంధించి ఉండదు. అసలు ఆ భాగమును గురించి పూర్తిగా శాస్త్రజ్ఞులకే తెలియదు. ఈ భాగము నకు చెందిన తంతువులు మెదడు క్రిందిభాగము లలోనుంచి క్రింద శ్రేకములో వుండే వెన్ను సెగ్మెంటులనుంచి ఆరంభమై, కంటిగ్రుడ్డు నుంచి క్రింద బాహ్యాంగముల (Sex Organs) వరకు అన్ని అంతరంగములకు వ్యాపించి ఉంటవి. సింపతెటిక్ పేరా సింపతెటిక్ నరములకు కొన్ని ప్రత్యేకములయిన గేంగ్లియానులద్వారా అన్యోన్య సంబంధము ఏర్పడి ఉంటుంది. ఒక రిఫ్లెక్సు కార్యము (Reflex Action) జరగాలంటే, ఒక ఇంద్రియంద్వారా సెన్సరీ భాగానికి వార్త చేరాలి. ఆ వార్త సంబంధ న్యూరా నులద్వారా మోటారున్యూరానులకు చేరాలి. మోటారు న్యూరానులనుండి కండరములకో, గ్రంధు లకో ఆ వార్త పోయి అవి పనిచేయాలి. ఈ పని శిరోనరములద్వారా జరగవచ్చును. వెన్నునరముల ద్వారా జరగవచ్చును, లేక స్వచ్ఛంద నరములద్వారా జరుగవచ్చును. ఇచ్ఛాధీన శిరోనర ములద్వారానూ, వెన్ను నరములద్వారానూ జరిగే రిఫ్లెక్సులు మన ప్రమేయం లేకుండా జరగవచ్చును. మనకు ఇచ్ఛాధీనంగానూ జరగవచ్చును. స్వచ్ఛందనరముల ద్వారా జరిగే రిఫ్లెక్సు మనకు తెలియకుండానే జరిగిపోతుంది. మన ఇచ్ఛచేత అల్లా జరిగించనూ లేము. అల్లా జరగడమును ఆపనూలేము. దుర్భరమైన కాంతి కంటికి తగలగానే కంటిపాప చిన్నది అవుతుంది వెలుతురు లేనప్పుడు పెద్దది అవుతుంది. ఇల్లా కంటిపాపను మనం మన ఇష్టానుసారంగా చిన్నదీ పెద్దదీ చేయలేము. కంట్లోకి ఏదైనా పోతున్న ప్పుడు మనకు తెలియకుండానే మన కంటిరెప్పలు మూసుకుంటవి. కాని మనం కంటిరెప్పలు ఇచ్ఛా ధీనంగానూ మూయగలము. ఘుమ ఘుమలాడే తిను బండారమును చూస్తే జఠరాశయంలో జఠర రసము ఊరుతుంది. ఇల్లా జరగకుండా మనం ఆపలేము.

రిఫ్లెక్సులో సెన్సరిభాగానికి వార్తను పంపించే యింద్రియ భాగము, దానిని మోటారుభాగానికి వార్తనుపంపే మధ్యన్యూరాను, మోటారున్యూరాను ఆదేశమును జరిగించే శరీరభాగము— వీటన్నిటినీ కలిపి రిఫ్లెక్సు ఆర్కు అంటారు.

నరములలో వార్త పోవడము, ఎలక్ట్రిక్ తీగెలో కరెంటు ప్రవహించడము వంటిదే. నరము లలోవార్త కూడా ఎలక్ట్రిక్ కరెంటులాగే ఒక ఎలక్ట్రా నులబారు ఇంద్రియప్రేరేపణవల్ల ఉత్పత్తి అయిన విద్యుచ్ఛక్తి భేదంవల్ల, నరములద్వారా వ్యాపి స్తుంది. ఈ ప్రేరేపణను "స్టిమ్యులస్" (Stimulus) అంటారు. అదినరములలో కలిగించే చలనమును 'ఇంపల్సు' (Impulse) అంటారు నరముపోగులు, న్యూరానులతోనూ కండరముల గ్రంధుల, ఇంద్రియముల భాగములతోనూ అతికివుండవు. ఎలెక్ట్రిక్ స్విచ్‌తో భాగములలాగా అంటివుంటవి. ఇల్లా అంటే సందడమును సైనాప్సు (Synapse) అంటారు ఈ సైనాప్సుల స్థితిమీద, నరములశక్తి ఆధారపడి ఉంటుంది. కాఫీ, టీ, నికోటిన్ స్ట్రిక్నిన్‌వంటి వస్తువులు ఈ సైనాప్సుల శక్తిని అధికం చేస్తవి.

సింపతెటిక్ గేంగ్లియానులకూ వెన్ను పాము సెగ్మెంట్లకూ సంబంధము ఉన్నదని తెలుసుకున్నాము. జీర్ణకోశానికి సంబంధించిన జఠరాశయము, లివరు, పేంక్రియస్ ప్రేగులు ఇవన్నీ వెన్నుపాములో, 6, 7, 8, 9, 10 సెగ్మెంట్లతో సంబంధం కలిగివున్నవి. వృక్ష భాగంలో ఉండే సింపతెటిక్ గేంగ్లియానులన్నీ, వక్షోదరములలో వున్న అంగములతో సంబంధం కలిగివున్నవి. ఈ కారణంచేత ఈ అవయములలో ఏది రోగగ్రస్తమైనా ఆ రోగప్రభావం అంతో యింతో ఆనరములతో సంబంధమున్న ఇతర అంగములమీద ప్రసరిస్తుంది.

రిఫ్లెక్సులు చాలావున్నవి. రోగనిదానములో, రోగస్థానమును నిర్ణయించడంలో, వీటిని గురించిన పరిజ్ఞానము చాలా సహాకరిస్తుంది. పొట్టమీద గ్రాచికపుల్లతో గీస్తే పొట్టకండరములు సంకోచిస్తవి. టైఫాయిడ్ జ్వరంతో ఈ రిఫ్లెక్సు బలహీనంగా వుంటుంది. ఒకస్థితిలో వుండదు కూడా అరికాలును పుల్లతో గీరితే కాలివ్రేళ్లు క్రిందివైపుకు వంగుతవి. కొన్ని నరాశయవ్యాధు లలో కాలివ్రేళ్లు పైకివంగుతవి. కొన్నివ్యాధు లలో కంటిపాపలు, కాంతికిసమానంగా సంకో చించవు. విపరీతంగా త్రాగినవాడి కంటిపాపలు చాలా పెద్దవై ఉంటవి నరాశయ విజ్ఞానంవున్న వారు, వీటినిబట్టి రోగనిర్ణయం చేస్తారు. సందర్భమునుబట్టి ముఖ్యమైన రిఫ్లెక్సులను వివరిస్తాను. శరీరస్థితినిబట్టి రిఫ్లెక్సులు అతిశయంగానూ రావచ్చు (Exaggeration), దుర్బలంగానూ రావచ్చు (Diminished), అసలు రాకనే పోవచ్చును.

జీర్ణకోశానికీ,— ముఖ్యంగా జఠరాశయా నికీ— మనస్థితికీ అత్యంత సన్నిహిత సంబంధం ఉన్నది. మనస్సుకూ స్వచ్ఛంద నరకోశానికీ (Autonomous Nervous System) అతిసన్నిహిత సంబంధమువున్నది.

రెండుమూడు సెగ్మెంట్లలో వున్న న్యూరానులు సంబంధం కలిగివున్నందున, ఆ సెగ్మెం ట్లతో సంబంధంవున్న శరీరాంతర్భాగములలో

44-వ పేజీ చూడండి




1. చర్మంలో స్పర్శేంద్రియ నరాగ్రములు. 2. కండరము చివరవుండే టెండను. 3. కండరము. 4. గ్రంధి. 5. వెన్నునరములో సెన్సరీశాఖలో వుండే గేంగ్లియాను. 6. డ్యూరా మేటరు. 7. ఎరక్నాయిడు. 8. పయా మేటర్. 9. సెరిబ్రో స్పైనల్ ఫ్లూయిడ్ 10. వెన్నునరము మోటారుశాఖ 11. వెన్నునరము సెన్సరీశాఖ 12. వెన్నునరము. 13. తెల్లభాగము. 14. గోధుమభాగము. 15. సుషుమ్నద్వారము.



పురిటిపాపలను చంపివేయమని రాజు హీరోడ్ ఇచ్చిన ఆజ్ఞను జోసెఫ్ కలలో తెలుసుకొని జీసస్, మేరీలతో ఈజిప్టుకు పారిపోతాడు.

సినిమాకథ :

# కింగ్ ఆఫ్ కింగ్స్

సాయంసమయం చాలా ప్రశాంతంగా కన్నులపండువుగా ఉంది. అప్పుడే సూర్యుడు గాలిలీ కొండల వెనక్కి దిగిపోయాడు. ఆజానుబాహువు, యువకుడు జోసెఫ్ అనే వడ్రంగి పనిముట్లు పట్టుకుని నాజరత్ నగరపు ఇరుకు వీధులగుండా ఇంటికి ప్రయాణమయ్యాడు. ఆ రోజుల్లో జూడియా రోడ్డుమీద నడిచేవాళ్ళకు శాంతిభద్రతలపైన అంతగా ఆశ ఉండేదిగాదు; జోసెఫ్ నిట్టూరుస్తూ, దురాక్రమిత ప్రాంతం ప్రతిదానిలోనూ సాధారణంగా ఉండే నిగూఢ ఉద్రిక్త మనస్తత్వంగల గుంపుల్లో ఓదానిలో ప్రవేశించాడు.

అక్కడికి కొంచెందూరంలో ఓ రోమన్ ఆశ్వికుడి కంచుకంఠం మోగింది—పన్నుల చెల్లింపుకు సమోదయేందుకుగాను జుడియాలో వున్నవాళ్ళంతా తమ జన్మస్థానాలకు తరలి వెళ్ళాలని రోమ్ చక్రవర్తి సీజర్ ఆదేశం—ఈ మాట చెప్పి ఆ ఆశ్వికుడు వెళ్ళిపోగానే ప్రజలంతా 'పన్నులు—పన్నులు—ఎప్పుడూ పన్నులు—రోమెటు! రోమ్! ఈరోమొకటి మన పీకలమీదకు' అని ఆందోళనపడ మొదలుపెట్టారు.

జోసెఫ్ ప్రక్కవీధిగుండా ఇంటికి బయల్దేరాడు. తన జన్మస్థలం బెత్లెహామ్. ఇప్పుడు గర్భవతి, భార్య మేరినికూడా తీసుకుపోవాలిగాబోలు. అందులో ఇదే తొలికాన్పు. ఇప్పుడు మూడురోజులపాటు ప్రయాణం చేయాలంటే ఆమూలాలు ఎంత శ్రమపడాలో ఏమో! ఇంట్లోకి వెళ్ళేముందు జోసఫ్ పశువులశాలలోవున్న ఓ చిన్న గాడిద చెవిలో ఇలా ఊదాడు. "నువ్వామెను జాగ్రత్తగా తీసుకెళ్లాలి. ఆమెకు మగపిల్లవాడు కలుగుతాడని అతనిని జీసస్ అని పిలవాల్సిందిగాను దేవకన్య మేరీకి చెప్పిందిట."

ఆ దంపతుల బెత్లెహాం ప్రయాణంలో మొదటిరాత్రి ఓ రాతిబండ మాటున తలదాచుకున్నారు. రెండో రోజు ప్రయాణంకూడా ఐపోయింది. మూడోరోజు ప్రయాణారంభంలో జోసెఫ్ ప్రయాణసన్నాహమౌతున్న మేరీని చూశాడు. "బడలికగా వుందా మేరీ? చాలా ఇబ్బందిగా ఉందా?" అని ఆత్రుతతో ప్రశ్నించాడు. ఆతనిభుజాన కాస్త విశ్రాంతి కోసం దగ్గరగా మేరీ రాగా జోసెఫ్‌కు ఏదో వింత అనుభూతి కల్గింది. ఆ ఉదయం అతనికి ఏదో కొత్తవెలుగు నిస్తున్నట్లనిపించింది. మేరీజీవితానికి ఓ కొత్త వెలుగు రావాలి అనుకున్నాడు జోసెఫ్. మేరీ అలాగే ఆకాశంవేపు ఏదో ఆకాంక్షిస్తున్నట్లు చూస్తూ వుంది.

"మేరీ కొత్తవింతేమైనా మనకు సంభవింపబోతోందా" అన్నాడు జోసెఫ్. ఏ దేవతన్నా కనిపించిందేమో ఆమెకు!

"భయపడకు జోసెఫ్, నేనూ బిడ్డా కూడా క్షేమంగానే వుంటాం" అన్నది మేరీ.

—౩౨ వ పేజీ చూడండి

ప్రాచీన గాథలను అనుపమమైన చలనచిత్రాలుగా తీసే ఖ్యాతిగలసంస్థలలో యం. జి. యం. ఒకటి. క్రీస్తు జీవితకాలంలోని కథ ఆధారంగా ఈ సంస్థ నిర్మించిన 'బెన్ హార్' చలనచిత్రగాథను ఆంధ్ర సచిత్ర వారపత్రికలో సీరియల్ గా వెలువరించిన విషయం పాఠకులకు విదితమే. క్రీస్తుజీవితం ఆధారంగా ఈసంస్థ నిర్మించిన నూతనచిత్రం "కింగ్ ఆఫ్ కింగ్స్" గాథ కూడా వారి సౌజన్యంతో పాఠకులకు అందజేస్తున్నాము.

# ప్రేమ కానుక

బొమ్మలకథ

బి.వి. సత్యమూర్తి 8

అవీ అఘోరించబ లేదు

మామ్మే.... దా, యాడవకు అమ్మ కావాలా వస్తుందిలే పొద్దున్న మంచివి ఆట కావాలా?

ఒరేయ్ యేడవకు చంపుతా

ఒరేయ్ నీ ప్రేమ కాదు కానీ నా ప్రాణం మీదికి తెచ్చావ్ ఏం వద్దురా నీ తెల్లవారగానే వాణ్ణక్కడ పారేసిరా

ఇప్పుడు రానున్నావే మాటలు, అను అను దీనిష్టం వచ్చినట్లను అసలు ఈ తతంగం పెట్టింది నువ్వా నేనా..?

ఖు.. ఖు.. ఖుద్దాబ్బిందిరా నేనే వాడికి ఆకిట పాలు కావాలేమో కే ఖూడన్నాయి ఏడవమను

మామూలు సీసాలో పాలుపోసి తిత్తిపెట్టి పడ్తుంటాడు వీడింకా ఏడుపు మానడు

ఇదెక్కడి పీడరా నాయనా.

ఇంకా ఏడుపు మానడేమిట్రా?




## జరిగిన కథ

ఐదు వాటాల లోగిలియిల్లుగలావిడ వరసమ్మగారు మనుమడు సూర్యానికి తల్లీతండ్రీతానే అయి పెంచింది. ఆ ఐదు వాటాల లోగిలిలో రకరకాల కుటుంబా లున్నాయి. రాజ్యలక్ష్మికి వరసమ్మగారంటే చనువూ, భక్తీ. సూర్యం బావంటే బిగూ, నిర్మలంటే స్నేహం. సాంబశివంగారికి గతం గాయం. సూర్యం నిర్మలకి పాఠాలు చెబుతూంటాడు. మేనమామ కూతురు మీనాక్షితో సూర్యానికి చనువు ఏర్పడుతుంది. నూతిగట్టున కాలు జారిపడిన వరసమ్మగారికి నిర్మల ఉపచారం చేస్తుంది. రాజ్యలక్ష్మిని వదిలించుకునేందుకు లలితాంబ పథకం వేస్తుంది. తానుచేసిన తప్పు భార్యకు చెప్పే ధైర్యం లేని సాంబశివంగారు రాజ్యలక్ష్మికి ఆమె జన్మరహస్యం తెల్పి పెళ్ళిమానిపించాలని ప్రయత్నిస్తాడు. ఈ పెళ్ళి సంగతి విన్న సూర్యం మనస్సు వికలమవుతుంది.

## 43

ఐతే నిర్మల ఎక్కడ ?

నిర్మలకు మాత్రం ఎవరున్నారు అక్కడ ? ఎవరుకావాలనుకుంటున్నదాపిల్ల. నిర్మల రాజ్యలక్ష్మికి మల్లే లోకంతీరు మనుషుల ప్రవృత్తులూ తెలియనిది కాదు. వాస్తవానికి అవన్నీ ఆపిల్ల అనుభవించింది. కాని వస్తుతః ఆ యిద్దరూ అనాథలు. విచారిస్తే న్యాయం వాళ్ళ పక్షమేగాని న్యాయ నిర్ణేత లెక్కడ ?

స్వర్గమే ఉండి అక్కడొక న్యాయస్థానమే ఉంటే యేమో ? 'ఇక్కడ గాకపోతే అక్కడ...' అంటారు.

మరి స్వర్గానికి పోవాలంటే మరణమే కదూ... దగ్గర మార్గం.

ఆవేళ కుంకుమభరిణె తోసహా నిర్మల పారిపోవడానికి కారణం కేవలం తను అబద్ధమాడి అన్ని రోజులూ అశుభం చేసింది గనుకనే కాబోలునని వరసమ్మగారనుకొన్నది. కాని నిర్మల చేసిన ఆ అశుభం తెలిసి చేసినదే .... గనుక నిర్మల నంత బాధపెట్టవేలేదు. ఆపిల్ల అంత దిగ్భ్రాంతయ్యె ప్రమాదపడి అంతలో తేరుకుని అక్కణ్ణుంచి పారిపోవడానికి కారణం ఆపిల్లకు మరో నిజం అక్కడ అప్పుడు తెలిసి రావడమే....

అదివర కెన్నడూ నిర్మల వరసమ్మగారి పూజా మందిరంలో వట్టింట అడుగు పెట్టలేదు. ఆమె హృదయంలో చాలినంత జాగా చేసుకున్న తరు

—41 వ పేజీ చూడండి

కోర్టునుంచి తిరిగివచ్చిన ఆనందరావుకి చెల్లెలు శారద దగ్గరనుంచి వచ్చిన ఉత్తరం కనుపించింది అతని బల్లమీద. చిన్నాన్నగారి అమ్మాయే అయినా సొంత చెల్లెలు లాంటిదే ఆనందరావుకి శారద. బియ్యేస్సీ ప్యాసవగానే నాన్నగారు పై ఊరు పంపించడానికి అంగీకరించ కపోవడంతో ఆ సంవత్సరమే అదే ఊళ్ళో ఉన్న లేడీస్ కాలేజీలో డిమాన్‌స్ట్రేటర్‌గా జేరింది.

ఉత్తరం విప్పి చదువుకున్నాడు. ఉత్తరంలో కనుపించినదల్లా—శారదా, మరో ఇద్దరు లెక్చరర్లు, సుమారు పాతికమంది విద్యార్థినులూ. ఆరోజుసాయంత్రం రైలులో ఆ ఊరు వస్తారుట. ఆరోజురాత్రి ఆ ఊళ్ళోనే ఉండి మరురోజు పొద్దున్నే దేవీపట్నం బస్సులో వెళ్ళిపోతారుట. బస్సుకీ—లాడ్జింగ్‌కీ ఏర్పాట్లు చేయించాలిట......మతిపోయింది ఆనందరావుకి. వాచీ చూసుకున్నాడు. అయిదుగంట లయ్యింది. అంటే ఇంకో రెండు గంటల్లో రైలు వచ్చేస్తుంది. వస్తున్న వాళ్ళందరూ అమ్మాయిలు. వాళ్ళందరికీ ఏర్పాట్లు ఎక్కడ చెయ్యాలి. పోనీ రెండురోజులు ముందరగానే వ్రాసిఉండవలసింది చెల్లెలు. ఏమనుకుంటే ఏం లాభం?

మరొక్క నిముషం ఆలోచించాడు. మేడమీద తన గదీ, మరో పెద్దగదీ, డాబా వాళ్ళకు ఇస్తే సరి. సులభంగా ముప్ఫైమందికీ సరిపోతుంది. ఆ విషయమే అమ్మతో చెప్పాడు.

“అలాగేరా! పాపం వాళ్ళకి మనం ఏం చెయ్యాలి కనుక!?” అనేసింది ఆవిడ.

రైలు ఇంకో పావుగంటకు వస్తుంధనగా రైలుస్టేషన్ చేరుకున్నాడు రావు. ప్లాటుఫారంమీద పచార్లు చేస్తున్నాడు, ఆ వచ్చిన వాళ్ళందర్నీ ఇంటిదాకా ఎలా తీసుకు వెళ్ళడమా అని ఆలోచిస్తూ. బ్రిడ్జిమీద దూరంగా రైలు కూసింది. రైలు బ్రిడ్జి మీద ఓగజం ముందరికి వస్తుంటే ఆనందరావుకిగుండె నిముషానికి మరోసారి ఎక్కు



# అమ్మాయిల మధ్యలో ఆనందరావు



'ఆనందకృష్ణ'

వగా కొట్టుకోవడం మొదలుపెట్టింది.

ప్లాటుఫారం మొదటే నిలుచున్నాడు, మిలమిల మెరిసిపోయే మల్లెపువ్వుల్లాంటి తెల్లటి బట్టలతో. ముందర రెండు మూడు కంపార్టుమెంటులు రావుని దాటి వెళ్ళిపోయాయి. ఆ కంపార్టుమెంటుని చూడగానే వాళ్ళే అయ్యుంటారు అనుకుని ఆ కంపార్టుమెంటు కూడా నడవడం మొదలుపెట్టాడు.

"టినోపాల్ ఏజంటులావున్నాడే" అంది కంపార్టుమెంటు గేటుదగ్గర నిలుచున్న ఓ అమ్మాయి.

వెంటనే "బావుండదోయ్ — మన మేడమ్ బదర్ స్టేషనుకి వస్తారుట......ఒకవేళ ఆయనే అయితే.."

అంతలో "ఆగండమ్మా......ఒక్కమాటు పక్కకు తప్పుకోండి" అంటూ శారద గుమ్మం దగ్గరకువచ్చి పక్కనే నడుస్తున్న అన్నయ్యను పిలిచింది

శారద పక్కనే నిలుచున్న అమ్మాయిలు ఒకరిమొహం ఒకరు చూసుకున్నారు.

రైలు ఆగడం తరువాయి శారదా ఆమెతో మరో పాతికమంది అమ్మాయిలు కిందకు దిగారు.

"అమ్మబాబోయ్. ఇంతమంది మధ్యలో తను ఒక్కడూ ఎలాగ వీళ్ళందర్నీ ఇంటిదాకా తీసుకువెళ్ళడం......!" అనుకున్నాడు రావు.

చూస్తుండగానే వాళ్ళతో వచ్చిన ప్యూనుకూలీల సహాయంతో ఓ ఎవరెస్టు శిఖరం అంత ఎత్తున హోల్డాల్సూ — సామాన్లూ పేర్చేశాడు ప్లాటుఫారంమీద. పసిఫిక్ సముద్రం అంత లోతుకి పోయినట్టయింది ఆనందరావుకి.

"నయం! నువ్వు వచ్చావు... .అసలు నా ఉత్తరం అందిందో లేదో అని ఎంత భయపడ్డామో! నువ్వురాకపోతే ఏం చెయ్యాలో అని ఆలోచిస్తున్నాం....."అన్నయ్యతో అంది శారద.

# ఉజ్వలమైన

*అత్యాకర్షకమైన*

స్టెయిన్‌లెస్
స్టీల్ పాత్ర సామానులు
—మీరు కోరునవన్నీ గలవు.

అంద చందాల బహుమానాలు
మిమ్మల్ని తప్పక మెప్పించగలవు.
ఈ బహుమాన కూపనులను
ఓ.కే. తయారీ వస్తువులనుండి
చేర్చిపెట్టండి.







మీరు కొను ఈ క్రింది ప్రతి ఓ.కే. తయారీ వస్తువునుంచిన్ని బహూమాన కూపనులను చేర్చిపెట్ట ప్రారంభించండి.

- ఓ.కే. వనస్పతి • ఓ.కే. డబుల్ రిఫైన్డ్ ఆయిల్
- గోల్డన్ సలడ్ ఆయిల్ • ఓ.కే. చందన సబ్బు
- ఓ.కే. ఓరియంటల్ రోజ్ సబ్బు • ఓ.కే. నీమ్ సబ్బు
- మియోకే సబ్బు • సోప్‌చిప్పు

మరిన్ని ఆ మీ కూపనులకు మారుగా అత్యాకర్షణీయములగు స్టెయిన్‌లెస్ స్టీల్ పాత్రలను — మీకు ఇష్టమైన పరిమాణ ప్రమాణాలలో — మీకు అతి సమీపమువగల ఓ.కే. వ్యాపారి వద్దనుండి పొందండి.

ఈ ప్రత్యేక బహూమానయోజనల గురించిన విశేష వివరాలు గల పత్రిక ఫోల్డరుగురించి మీ ఓ.కే. వ్యాపారిని అడిగి పొందండి.







EP-EAC-27 TEL

*తయారుచేసినవారు :*
**ది ఈస్ట్ ఏష్యాటిక్ కం. (ఇండియా) ప్రైవేట్ లిమి., మదరాసు-1**

# అమ్మాయిల మధ్యలో ఆనందరావు

"అదేమిటే ...... ఓ రెండురోజులు ముందర వ్రాస్తే ఏంపోయింది చెప్పు......పైగా వచ్చిన వాళ్ళందరూ అమ్మాయిలు కూడానూ......" అన్న అన్నయ్య మాటకు,

"అసలు నిన్నటివరకూ నే వస్తాననుకోలేదురా— ఆఖరు నిముషంలో ఈ ఊళ్ళో ఏర్పాట్లు చేస్తా నన్నవాళ్ళు డిసీవ్ చేయడంతో అంతా నా నెత్తిన పెట్టేశారు. ఇంక తప్పక నీకు వ్రాశాను, ఏం చెయ్యాలో తోచక. అఫ్‌కోర్సు నువ్వు సహాయం చేస్తా వని ధైర్యంవుండే నే వీళ్ళతోపాటు రావడానికి ఒప్పు కున్నాను" అనేసి, తన సహోధ్యాయినులు రాధా, లక్ష్మిలను పరిచయం చేసింది. ఆ సంవత్సరమే ఎడ్వొకేటుగా ఎన్‌రోల్ అయిన అన్నయ్య ఆనంద రావుకి.

ఆనందరావు వాళ్ళతో మాట్లాడుతూ, తనకి చెల్లెలు ఉత్తరం ఆ సాయంత్రమే అందింది అనీ, అందువల్ల పెద్ద ఏర్పాట్లు ఏమీ చెయ్యలేకపోయా ననీ చెప్పాడు.

"పోనీలెండి......ఈ రాత్రికి లేడీస్ వెయిటింగ్ రూమ్‌లో ఉండిపోతాము. ఎలాగా పొద్దున్న బస్సుకి వెళ్ళిపోవాలిగా" అన్నారు రాధా, లక్ష్మి.

అంతమంది అమ్మాయిలను వెయిటింగ్‌రూమ్‌లో ఉండమంటే తనని గురించి వాళ్ళేమనుకుంటారు. తనకి ఆపాటి పలుకుబడి లేదంటే ఎంత అవమానం? అనుకుని,

"మీ కొలీగ్సుకికాని ...... మీ విద్యార్థినులకుకాని అభ్యంతరం లేకపోతే మనింట్లో మేడమీద గదుల్లో ఉందురుగాని......" శారదతో అన్నాడు ఆనందరావు.

"మాకు అభ్యంతరం అని కాదండీ...... మీకు అనవసరమైన శ్రమ అని" నసిగారు రాధా, లక్ష్మిను.

"ఏం పరవాలేదు ...... ఇదీ మా ఇల్లే. రిక్షాలు చూడరా అన్నయ్యా" అనేసింది శారద.

ప్లాటుఫారంమీద దిగిన పాతికమందీ గుణ గుణ మంటూ ఏవో ఖబుర్లు చెప్పుకుంటున్నారు. ప్లాటు ఫారంమీదఉన్న జనం అంతా రైల్లోంచి దిగిన ఆ పాతికమంది అమ్మాయిలవైపు — మధ్యలో ట్రిమ్‌గా తెల్లటి బట్టలతో తయారయిన ఆనంద రావువైపూ చూస్తున్నారు. వంటిమీద తేళ్ళూ జెర్రెలూ పాకినట్టయింది. జడ్జీలముందు ధైర్యంగా మాట్లాడే ఆనందరావుకి ఆ క్షణంలో ఆధైర్యం అంతా ఎక్కడికో వెళ్ళిపోయింది. ఎక్కడలేని సిగ్గూ వచ్చేసింది. ముప్ఫై మందిలో తను ఒక్కడే మగపురుగు...ఏమిటో ఆలోచిస్తున్నాడు.

"వెళదాంరా అన్నయ్యా" శారద మాటలు ఆనందరావుని ఈ లోకంలోకి తీసుకువచ్చాయి.

"ఉ.....మరి భోజనం సంగతి.....హొటలు ఇక్కడకు దగ్గరే......

"భోజనం దార్లోనే చేశాం."

ఆ మాట అతని నెత్తిమీదనుంచి ఎంతో బరువు దింపినట్టయింది ఆనందరావుకి. హమ్మయ్యా! వీళ్ళందర్నీ రోడ్డంపట హొటలుదాకా నడిపించ వలసిన అవుసరంలేదు అనుకున్నాడు.

రిక్షాలు మాట్లాడి తిరిగి వస్తూన్న ఆనంద రావుకి "మేడమ్ బ్రదర్ మన కొత్త ఇంగ్లీషు మేష్టారిలా లేడుటే"

"పోవే పాపం ఈయన్ని వాడితో పోల్చడమేమిటే!" అన్న మాటలు విన్పించాయి.

ఆనందరావు ఆ మాటలువిని 'లెక్చరర్ని వాడూ, వీడూ అంటున్నారు—తనని ఏమనుకుంటారో' అన్న అనుమానం పట్టుకుంది.

చూస్తుండగానే సామానంతా రిక్షాల్లోకి జేరింది. రిక్షాలు బయలుదేరడానికి సిద్ధంగా ఉన్నా యనగా, ఓ అమ్మాయి తిన్నగా శారద దగ్గరకు వచ్చి, పక్కగా ఆనందరావు ఉన్నాడన్నైనా లెక్క చెయ్యకుండా, "మేడమ్...... నా రిక్షాలో నే నొక్కర్తెనే ఉన్నానండీ. నాకు భయమేస్తోంది......" అంది.

ఆనందరావు ధైర్యంచేసి, ఆ అమ్మాయివైపు చూశాడు. ఎందుకో ఆకర్షించింది. సన్నగా, నాజూగ్గా పొడుగైన విగ్రహం—ఆ చిలిపికళ్ళతో బెదురు చూపులూ........

శారద మరో అమ్మాయిని పిలిచి, ఆ అమ్మాయి రిక్షాలోకి పంపించింది. "నయం—నన్ను తనతో పాటు కూర్చోమనలేదు ఆ అమ్మాయి" అనుకున్నాడు ఆనందరావు.

రిక్షా ఎక్కుతూ, "ఎవరే ఆ అమ్మాయి?" అన్న రావు ప్రశ్నకు "శ్యామల అని ఫైనల్ ఇయర్ చదువుతోంది. మనవాళ్ళే" అంటూ జవాబిచ్చింది, నవ్వుతూ శారద, ఎందుకు అడిగాడో అర్థమయి నట్టుగా.

వాళ్ళందర్నీ ఇంటిదగ్గర వదలి రావు బస్సు ఏర్పాట్లు అవి చేసి వచ్చేటప్పటికి రాత్రి పన్నెండు గంటలు దాటిపోయింది. ఇంకా మేడమీద మెల్లిగా మాటలు విన్పిస్తున్నాయి.

"అదికాదే....తెల్లటి బట్టలు వేసుకుని ట్రిమ్‌గా తయారవ్వగానే సరా......ఆ దొంగ చూపులు ఎవ రికి తెలియవు కనుక.....బ్రోంచుకు తిరిగితే సరా......"

మేడ మెట్లెక్కుతున్న ఆనందరావుకి టక్కున బ్రేకుపడింది. ఆ మాటలు వినగానే....ఆ మాటలు తనను గురించే అంటున్నారేమో!......

"నిజమేనే. పైకిమాత్రం ఏమీ తెలియనివాడిలా కనుపిస్తాడు. మొన్న ఓరోజు క్లాసుకి కొంచెం లేటుగా వెడితే ఓ అయిదు నిముషాలు నావైపు చూడనట్టుగా నటించి, చివరకు స్టైలుగా 'గెటిన్' అన్నాడు. చచ్చేకోపం వచ్చింది నాకు" అంది మరో అమ్మాయి.

నన్ను కాదుకదా! అనుకున్నాడు ఆనందరావు. శారదను మెల్లిగా పిలిచి, బస్సు ఆరుగంటలకు వస్తుం దని ఏడుగంటలకల్లా బయలుదేరిపోవాలనీ చెప్పి కిందకు దిగుతూంటే "పాపం—పన్నెండు గంట లయ్యింది మేడమ్" అంది ఓ అమ్మాయి.

"మీరింకా పడుకోలేదూ—శ్యామలా......తొంద రగా పడుకోండి. మళ్ళీ పొద్దున్నే లేవాలి" అన్న

# అమ్మాయిల మధ్యలో ఆనందరావు

శారద మందలింపుతో అంతా నిశ్శబ్దమైపోయింది.

* * *

ఆనందరావు నిద్రలేచేసరికి ఇల్లు కళకళ్లాడుతోంది. ఎటు చూచినా అమ్మాయిలే. ఏం చెయ్యాలో తోచక, శారదను పిలిచి ఆమె సహాయంతో తన కాలకృత్యాలు ముగించుకున్నాడు. ఎవరినోటంపట విన్నా "మై కేలియా చంపకా—మై కేలియా చంపకా" అన్నమాటే. ఆనందరావుకి అర్థంకాక వాళ్ళవైపు చూశాడు. ప్రతివాళ్ళదగ్గరా సింహాచలం సంపంగి పూలు......ఊహూ! అనుకున్నాడు. తోటలోకి వచ్చి చూశాడు. మచ్చుకి గులాబీపువ్వు ఒక్కటైనా మిగల్లేదు. బావురుమందా మనిపించింది. అయినా ఏమీ అనలేక వూరుకున్నాడు.

బస్సు బయలుదేరడానికి సిద్ధంగావుంది.

"నువ్వు కూడా రాకూడదురా అన్నయ్యా...... మా బోటనీ ఎక్స్‌కర్షన్ ఎలా ఉంటుందో చూద్దువు గాని" అంది శారద.

"అవునండీ. మీరు రాకూడదూ" అన్నారు లక్ష్మీ, రాధానూ.

"పోనీ వెళ్ళరా! వాళ్ళంతగా అడుగుతూంటేను" అన్నారు, అక్కడే కూర్చున్న ఆనందరావు తండ్రి.

ఆనందరావుకి వాళ్ళతో వెళ్ళక తప్పలేదు. అయిష్టంగానే ఓ ట్రావెల్‌బాగ్ పుచ్చుకుని బస్సులో కూర్చున్నాడు ముందర సీటులో, సరిగా వెనకాతలే కూర్చుంది చెల్లెలు శారద.

బస్సు రాజమండ్రి పొలిమేరలు దాటింది. బస్సులో కలకలం ఎక్కువైంది. ఏవో ఏవేవో విషయాల మీద చర్చలు జరుగుతున్నాయి. ఆనందరావు కూడా మాట్లాడుదామనుకునేవాడు. అయితే వెంటనే జ్ఞాపకం వచ్చేది. ఆ బస్సులోఉన్న సుమారు ముప్ఫై మందిలోనూ తనూ, డ్రైవరూ, కండక్టరూ, తప్ప, తక్కిన వాళ్ళందరూ అమ్మాయిలే....

"మేడమ్—వచ్చే సంవత్సరం మనం ఊటీ వెడదామండీ......"

"ఏం!......"

"అది కాదండీ—మన సరోజనికి ఈ వేసంగిలో వివాహం. ఆయన ఊటీలో ఉద్యోగం చేస్తున్నారట......"

గొల్లుమన్నారు అమ్మాయిలంతా.

చివరకు పాటలమీదకు మళ్ళింది. "నువ్వంటే నువ్వు" అని వాగ్వివాదాల తరువాత తీయటి కంఠాలు ఒకటి తరువాత మరొకటి వినిపించాయి ఆనందరావుకి.

"పులకించని మది పులకించు—వినిపించని కథ వినిపింతూ" అంటూ చక్కగా విన్పిస్తోంది.

శారద, "అరేయ్! అన్నయ్యా పాడుతున్నది ఎవరో తెలుసా—శ్యామల" అంది మెల్లిగా రావుకి మాత్రం విన్పించేలా. రావు మొహంమీద మార్పులు శారద గమనించడానికి వీలులేకపోయింది. "ఊహూం!" అన్నాడు ఆనందరావు.

రోడ్డుకి రెండువైపులా దట్టంగా ఉన్నాయి చెట్లు. ... ఏవేవో గడ్డిమొక్కలు ఏరుకొంటూ మధ్యాహ్న సమయానికి గోదావరం చేరుకున్నారు. అక్కడ ఏర్పాట్లన్నీ చేసి ఉంచడంతో.. ....భోజనానంతరం మొక్కలను కలెక్టు చెయ్యడంకోసం బయలుదేరారు. చిగిర్చిన చెట్లు—విరబూచిన పూపొదలూ—ప్రకృతి సౌందర్యం తిలకిస్తున్నాడు ఆనందరావు.

అమ్మాయిలు జట్లు జట్లుగా విడిపోయారు శారద మొక్కలూ, స్పెసిమెన్సూ కలెక్టు చెయ్యడంలో పడి అన్నయ్యనూ మర్చిపోయింది. అమ్మాయిలు ప్రతి పొదలోకి దూరబడి ఏవో కొమ్మలు విరుస్తున్నారు. ఆనందరావుకి నోటి చివరదాకా వచ్చేది "పొదలలోకి వెళ్ళొద్దు ఏమయినా ఉంటాయి" అని అందా మనుకునేవాడు. మళ్ళీ అంతమంది అమ్మాయిలూ తన పిరికితనానికి భళ్ళున నవ్వుతారేమో అనిపించేది.

ఆనందరావు మెల్లిగా నడుస్తున్నాడు. కొంత మంది అమ్మాయిలు అతనితో నడుస్తున్నారు.

"చూశావా—శ్యామలా— ఆ చెట్టుమీద వేండా మనం కలెక్టు చేసిన వాటిల్లో లేదుకదూ......"

"అవునే......ఆ చెట్టుచూస్తే మన జూఆలజీ మేడమ్ అంత లావుగా ఉంది......ఎలాగ?"

"పోని ఆయన్ని కోసి ఇమ్మంటే......"

ఈ మాటలు విన్న ఆనందరావు ఇంక ఎలాగా తప్పదనుకుని తనకు అందినంతవరకూ తీసిఇచ్చాడు.

"థాంక్సండీ......మీది బాటనీ గ్రూపుకాదాండీ... అంది శ్యామల.

"అబ్బే కాదండీ......నేను ఆర్ట్సువాడిని."

"అయితే ఈ ఎక్స్‌కర్షన్ మీకు చాలా డల్‌గా ఉండి ఉంటుంది."

"ఎంతమాటండీ. .ఈ ఫారెస్టు ఏరియాలోకి రావడం నేనూ ఇదే మొదటిసారి."

కబుర్లు చెబుతూనేవుంది శ్యామల, మధ్య మధ్యలో ఏవో స్పెసిమెన్ కోయటంలోనో ఆనందరావు సహాయం అర్థిస్తూ సాయంత్రానికి మళ్ళీ అందరూ ఓ చోట చేరారు తెచ్చిన టిఫెన్లు తిన డానికి శారద 'ఐ యామ్ సారీ అన్నయ్యా! నీ విషయమై మర్చిపోయాను" అనేసింది.

అంతలో ఓ అమ్మాయి "మేడమ్ ఇది ఏ ఫామిలీ అండి?" అంటూ ఓ మొక్క పట్టుకువచ్చింది

శారద చాలా కోపంగా చూసి, "అది స్టైవ్ ట్యూబర్ కాదు. రూట్ ట్యూబర్—" అనేసి ఆ అమ్మాయిని పంపించేసింది అమ్మాయిలంతా గొల్లున నవ్వేశారు.

ఆనందరావు శారదవైపు చూశాడు: "ఎందుకు ఆ అమ్మాయిని గసురుతావని" అన్నట్టుగా.

"నీకు తెలీదూ ...... ఏవో నిక్‌నేమ్స్ పెడుతూనే ఉంటారు పాపం. మా జూఆలజీ లెక్చరర్ ఒకావిడ ఉందిలే—కొంచెం లావుగా ఉంటుంది...... అందుకని స్టైవ్ ట్యూబర్ అని నిక్‌నేమ్ పెట్టారు."

అంతలో శారదకూ—ఆనందరావుకి టిఫెన్లు తీసుకువచ్చి ఇచ్చింది శ్యామల — శారద తనలోతానే ఓ మాటు నవ్వుకుంది సన్నగా. ఆనందరావుకి "మన శ్యామల మేడమ్ బ్రదరంటే స్పెషల్ ఇంట్రస్టు చూపిస్తుందోయ్" అన్న మాటలు మెల్లిగా విన్పించాయి ఎవరినోటంపటో.

చీకటి పడుతోందనగా మళ్ళీ లాడ్జికి (వాళ్ళకిచ్చిన స్కూలు)కి చేరుకున్నారు. ఆనందరావుకి అమ్మాయిలు తనకు చేస్తున్న మర్యాదలు చూస్తే తను బియ్యే చదువుకునేటప్పుడు తన్నక్లాసులో ఉన్న ఒక్క అమ్మాయికే తన క్లాసువాళ్ళు చేసిన మర్యాదలు జ్ఞాపకం వచ్చాయి.

ఆనందరావుని ఆ వెన్నెలరాత్రి ఆ ప్రకృతి సౌందర్యం నిద్ర పోనివ్వలేదు. ఏవేవో ఆలోచిస్తూ పడుకున్నాడు.

---

దివాళాతీసిన ఒక సర్కస్ కంపెనీ తాలూకు వస్తువులన్నీ వేలంవేస్తున్నారు. చివరకు ఒక పెద్దపులిమీద పాటపాడుతు న్నారు. బక్కచిక్కిన పెద్దమనిషి ఒకడు ఆపులిని కొన్నాడు

"అది నీ కెందుకయ్యా? దాన్నిచూస్తే భయంవెయ్యటం లేదా?" సర్కస్ కంపెనీ యజమాని ఆశ్చర్యపోతూ అతణ్ణి అడిగాడు.

"భయం దేనికి? ఏదో తోడుగా పడి ఉంటుందని కొన్నాను. మాఆవిడ ఈమధ్యనే చచ్చిపోయిందికదూ! ఒంటరిగా ఉండలేకపోతున్నాను."

రమాదేవి (చిలకలపూడి)

---

అతడు నిద్ర పోతున్నాడనుకొని, మెల్లిగా మాట్లాడుకుంటున్నారు అమ్మాయిలు.

"ఇదేమిటి......ఇంత కుర్రాడిలా ఉన్నారు—అడ్వకేటుట" అంటోంది ఓ అమ్మాయి.

"పాపం సహాయం చేసే మనిషేనే. ఎన్నో స్పెసిమెన్స్ తీసిచ్చాడు నాకు......చాలా సింపుల్‌గా ఉన్నారు కదూ—ఎడ్వొకేట్ అన్న మాట కూడా మర్చిపోయి చెట్లు కూడా ఎక్కి స్పెసిమెన్స్ కలెక్టుచేసి ఇచ్చారు."

"మనని చూసి అలా కంగారుపడిపోతారెందుకే ?"

"ఓముప్ఫైమంది అమ్మాయిల మధ్యలో నువ్వొక్కత్తెవూ ఉంటే అర్థం అవుతుంది కంగారు పడటం ఎందుకో......"

"మన శ్యామల బస్సు దిగింది మొదలు ఆయన కూడానే తిరుగుతోందోయ్!"

"ఏమ్! ..."

చిన్నగా నవ్వులు విన్పించాయి ఆనందరావుకి.

మర్నాడు మళ్ళీ అడవులంపట తిరుగుతూంటే ఆనందరావుకి కొంచెం కొంచెం భయం వదిలిపోయింది.

రాజమండ్రి తిరిగిరాగానే ధవళేశ్వరం ఆనకట్ట కడియం పూలతోటలూ చూడటానికి బయలుదేరారు. ఈసారి కూడా ఆనందరావుకి వాళ్ళతోపాటు పోక తప్పలేదు......

ఆనకట్టదగ్గర బస్సు ఆగింది. అమ్మాయిలందరూ ఆనకట్టువైపు పరుగెత్తారు. ఆనందరావు, "శారదా—నీరు పాకుడు కట్టింది—జారతారు జాగ్రత్త" అన్నాడు శారదతో అంటున్నట్టుగా అందరికీ విన్పించేలా.

టక్కున ఆగిపోయారు ఆ అమ్మాయిలందరూ, ఏదో ఆఫీసరు ఆర్డరు ఇచ్చినట్టుగా.

"అన్నయ్యా! నువ్వు ముందర నడువు—మేం వెనకాతల వస్తాం" అంది శారద.

నీరు పాకుడుకట్టి ఉంది. ఏమాత్రం అజాగ్రత్తగా కాలువేసినా కాలు జారుతుంది.

'ఇంతమంది అమ్మాయిల్లో ఏ ఒక్కరైనా జారి పడితే........అమ్మో ఏమవుతుంది?" ఆలోచిస్తూ నడుస్తున్నాడు ఆనందరావు.

అంతలో జర్రుమని జారిన చప్పుడు విని వెనక్కి తిరిగాడు ఆనందరావు. సరిగా అదే సమయానికి జారి పడిపోబోతున్న ఓ అమ్మాయి ఆనందరావునికి ఆనుకుంది. ఆ పాతికేళ్ళ ఆనందరావు హృదయంలో కలుక్కుమన్నట్లయింది. అమ్మాయిలందరూ గొల్లున నవ్వేశారు.

"ఐ యామ్ సారీ అండీ" అంటూ సర్దుకుంది ఆ అమ్మాయి.

"అయినా శ్యామలా ఒళ్ళూ పంయీ తెలియక్కర్లేదూ......ఆయన చెబుతూనే ఉన్నారుకదా—జాగ్రత్తగా నడవమని. పడితే ఏమయ్యేది చెప్పు" గట్టిగా మందలించింది లక్ష్మి.

ఆనందరావువైపు చూసి చిన్నగా నవ్వింది. శారద.

రాజమండ్రి స్టేషన్లో—రైలు బయలు దేరడానికి సిద్ధంగావుంది. అధ్యాపకులు—విద్యార్థినులూ ఆనందరావుకి ఒక్క కంఠంతో థేంక్స్ చెప్పారు. రాధా, లక్ష్మి, రావు ఆ ఎక్స్‌కర్షన్‌కి రావడంవల్ల వాళ్ళకి ఎంతో సహాయంగా ఉందన్నారు.

ప్లాటుఫారంమీద శారదా, ఆనందరావూ నిలుచున్నారు. "అన్నయ్యా చెప్పడం మరచిపోయాను. ఆ శ్యామలా వాళ్ళ నాన్నగారు ఆ అమ్మాయికి ఈ వేసంగి శలవుల్లో పెళ్ళి చేసేద్దామనుకుంటున్నారు.... ఏమంటావ్. ఆయన్ని పంపించమంటావా ?" కొంటెగా నవ్వుతూ, మెల్లిగా ప్రశ్నించింది శారద.

ఆనందరావు జవాబుగా చిరునవ్వు నవ్వి వూరుకున్నాడు. గంట కొట్టడంతో శారద కూడా కంపార్టుమెంటులోకి ఎక్కిపోయింది. కదులుతున్న రైలు కిటికీలోంచి శ్యామల తన వైపే చూస్తూండటం గమనించాడు రావు ...... తేలికైన హృదయంతో హమ్మయ్య! అనుకుని ఇంటికి మళ్ళాడు రావు తన చేతులకు పట్టిన చెమటను తుడుచుకుంటూ.



# కింగ్ ఆఫ్ కింగ్స్

29-వ పేజీ తరువాయి

కానీ ఈశిశువు రోమనుల దాస్య శృంఖలాలనుంచి తామందరికీ విముక్తి కల్గించగలడా అనేదే జోసెఫ్ సందేహం. ఆవిషయమే మేరీ తోటిగూడా అన్నాడు. కారణ మేమంటే రోమనులు తమ ఏకేశ్వరోపాసనను అరికట్టకపోయినా... ఆరోజు మొదలు యూదుడన్నవాడికి శాంతి, స్వేచ్ఛ, క్షణకాలంపాటైనా నిర్భీకత లేకుండ పోయాయి.

'ఆరోజున' జరిగిందేమిటో... ఆ అవమానం జూడియాలోని ఆడా మగ, చిన్నా పెద్ద అందరి మనస్సుల్లోను ఇంకా నాటుకునే ఉంది...

ఎర్రని వలువలు, శిరస్త్రాణాలు ఆయుధాలు ధరించిన రోమను సైనికదళం ప్రపంచాన్ని హస్తగతం చేసుకుంది. చిన్నగా తూర్పు దేశాలు జయించుకొంటూ వచ్చింది. రోమనుల దాడిని మూడునెల్లపాటు ప్రతిఘటించిన జెరూసలెంకోట విచ్చిపోయి, మానవకంకాళాలు నుర్దిస్తూ రోమను సైనికదళాలు పట్నంలో ప్రవేశించాయి. ఇదేఐతే ప్రతివాడు మరచిపోగల్గేవాడేమో. రోమన్ సేనాని యూదుల పవిత్రాలయం మెట్లు గుర్రంచే దాటిస్తూ ఆలయాల దగ్గరికి వచ్చాడు. పవిత్రాతిపవిత్రమైన లోగిలిలో ప్రవేశించి ఆర్క్ ఆఫ్ కొవనెంట్ ఎదురుగా నిల్చాడు. ఏదో వెండిబంగారం దొరుకుతాయని ఆ సేనాని దాన్ని బ్రద్దలుకొట్టించాడు. కాని బంగారం వెండీ ఏమీలేవు. ఈజిప్టు నుండి వచ్చేటప్పుడు మోజస్ తన ప్రజలకందించిన పవిత్ర నిబంధనలు మాత్రం ఉన్నాయి. సేనాని బూతులతో జరూసలేం అంతా మారుమ్రోగింది. ఆ అవమానం భరింపరానిదైంది. అందుకే తమకు స్వేచ్ఛ ప్రసాదించి వెనుకటి ఉజ్వల స్థితిని పునః ప్రతిష్ఠచేసే రక్షకుడి కోసం యూదులు ప్రార్థనలు చేస్తున్నారు.

"ఆ రక్షకుడు నీ కుమారుడే నంటావా మేరీ!" అన్నాడు జోసెఫ్. మేరీ ఒక దీర్ఘనిశ్వాసంతో "అవును జోసెఫ్-రక్షకుడయ్యేది నాకొడుకే" అంది. రోమ్ ఆజ్ఞానుసారం పన్ను చెల్లింపుకు సమోదయ్యేందుకు వచ్చినవారితో బెత్లెహాము వీధులు, సత్రాలు, భోజనశాలలు నిండిపోయాయి. ఎక్కడా ఖాళీ లేదు.

అయ్యా! నా భార్య ప్రసవానికి సిద్ధంగా ఉంది - ఏదైనా గది చూపించండి అని సత్రం యజమానితో జోసెఫ్ మొరపెట్టుకున్నాడు సమాధానంగా 'ఖాళీ లేదు,' 'ఖాళీ లేదు!' అని హడావుడి చేస్తున్న సత్రం యజమాని అకస్మాత్తుగా మేరీ వేపు చూశాడు. పరిస్థితి అర్థంచేసుకున్నా కొంత అయిష్టతతోనే.

"మీ క్కావాలంటే మా గుర్రాలశాలలో నా చేతనైనంతా సర్దుబాటుచేసి స్థలం ఏర్పరుస్తా నన్నాడు.

గడ్డిపోచల చాపలతో పక్కలు సిద్ధం చేసుకున్నారు జోసఫ్ మేరీలు. నవ్వుతూ మాట్లాడుతున్న మేరీ ఆయాసంగా, బాధతో మెలితిరిగి పోవటం మొదలుపెట్టింది.

బానిసలను పాలించేందుకుగాను వారిలోంచి ఓరాజును రోమను గవర్నరుకింద రోమనులు ఏర్పాటు చేశారు. యూదుడన్నవాడెవడూ రోమను కింద పనిచేయడనేనమ్మకం వుండటంవల్ల జూడాను బెడోయిన్

జాతికి చెందిన హీరాడ్ ఆ రోజుల్లో పరిపాలిస్తుండేవాడు. ఒకనాడు ముఖ్య సైనిక దళాధిపతి లూసియస్, విలువగల రత్నాలు వజ్రాలు ధరించిన ఓ ముగ్గురు వ్యక్తులను వెంటబెట్టుకొని హీరాడ్ సభాభవనంలో ప్రవేశించాడు.

"ప్రభూ వీరు ముగ్గురూ తూర్పు దేశాల రాజులు. వీళ్లకు నక్షత్ర శాస్త్రం తెలుసుట, అందుకు వీళ్ళను మాగీలనికూడా అంటారు" అని పరిచయంచేశాడు లూసియస్.

"వాళ్ళిక్కడేం చేస్తున్నట్లు ?" హీరాడ్ అడిగాడు.

"జూడియా కొత్తరాజును వెతుక్కుంటూన్నారు !"

హీరాడ్ వెర్రెత్తినట్లు కేకలెయ్యడం మొదలెట్టాడు.

"ఏవిటీ రాజుకోసమా? జూడాకు హీరాడ్ అనే నేనొక్కణ్ణే రాజును. నా ఎదుట ఇంకొకణ్ణెవరో రాజంటానికి ఎంత ధైర్యం ? ఎవడా మోసగాడు ? ఎక్కడున్నాడు?"

పర్షియారాజు మెల్కాయర్ తాపీగా సమాధానం చెప్పాడు.

"ఆ దైవాంశసంభూతుడు, గుర్రాలశాలలో పుట్టాడు."

"జూడాప్రభువు గుర్రాలసాలలో పుట్టాడా? చాలా బాగుంది. ఏంవింత? అయినా, ఆ రాజాధిరాజును ఎందుకు చూడాలని వచ్చారిక్కడికి? హీరాడ్ అడిగాడు.

మెసపొటేమియారాజు కాస్పర్ సమాధానం చెప్పాడు. "ఓ దివ్య నక్షత్రం మమ్మల్ని ఇలా తీసుకు వచ్చింది."

హీరాడ్ కొత్త ఎత్తు ఎత్తాడు "చూడండి! ఆ పవిత్రశిశువు మీకు కన్పిస్తే కాస్త నాకు కబురుచెయ్యండి! నాకు తోచినట్లు గౌరవిస్తాను.

ఆరాజులు వెళ్ళిపోగానే సేనానితో;

"లూసియస్! నీవు నీ సైన్యంతో ఈ రాజులవెంట వెళ్ళి ఆ ప్రదేశాల్లో కొత్తగా పుట్టిన శిశువులందర్నీ నరికించివారెయ్ !" ఆజ్ఞాపించాడు.

సభంతా ఆమాటతో లోలోపలే కంపించిపోయింది. లూసియస్ కొంత విసుగ్గా "రోమన్ సైనికు డెప్పుడూ శిశుహత్య చేయడు" అన్నాడు.

"సీజర్ గా నినాన్నాజ్ఞాపిస్తున్నా ! సీజర్ నే ఎదిరిస్తావా!" అంతే.

ముగ్గురు రాజులూ బెతెల్హామ్ చేరేలోగా రోమన్ సైనికుల కత్తులు వేలాది శిశువుల రక్తంతో ఎర్రబడిపోయాయి. సైన్యం బెతెల్హాంచుట్టూ గాలిస్తోంది ఆ పవిత్రశిశువుకోసం.

ఈ భయంకరవార్త జోసఫ్‌కు కలలో ఎవరో చెప్పి ! మేరీ, శిశువులతో పారిపొమ్మని హెచ్చరించారు.



– వింటున్నారా – పైగా – ఆ అధ్యక్షుడే పత్రికా విలేఖరట అందుకే – కూర్చునే ఇలా రాసి పారేస్తున్నాడు

# కింగ్ ఆఫ్ కింగ్స్

ముగ్గురు రాజులూ గుర్రాల సాలలో ప్రవేశించారు. బంగారం, తదితర వస్తువులు ఆ శిశువుకు సమర్పించి శిశువుముందర వినమ్రులయ్యారు.

ఆరోజు రాత్రి మేరీ తన బిడ్డకు లోకోద్ధరణకు అవతరించిన వ్యక్తికి ఏం ఆపద రాబోతుందో అని కలవరపడ్తూనేవుంది.

గుర్రాలసాలలలో జన్మించిన దైవాంశసంభూతినిసంహారించేందుకు రోమన్ సైనికులు వెతుకుతున్న సమయంలోనే జోసఫ్, శిశువుతో మేరీ, ఆ నగరాన్ని విడిచి ఈజిప్టుకు వెళ్ళిపోయారు. హీరాడ్ మరణం వరకు అక్కడే వుండిపోయారు.

హీరాడ్ కుమారుడు ఆంటిపస్ రాజ్యం చేస్తున్న సమయంలో జోసెఫ్, మేరీలు కుమారుడితో సహా నజరెత్ లోని స్వగృహానికి తిరిగి వచ్చారు. ఏడేళ్ళ జీసస్, తండ్రికి వడ్రంగంపనిలో సాయపడ్తుండేవాడు అప్పటికి జీసస్‌లో ఏదో తెలియని ఓ ఆకర్షణశక్తి ఏర్పడింది.

జనాభా లెక్కలకోసం లూసియస్ కూడ అటువచ్చి జీసస్‌ను చూట్టం జరిగింది. అప్పటికే జీసస్‌కు పన్నెండేళ్ళు. 'జీసస్ పుట్టిందెక్కడ' అడిగాడు లూసియస్.

'బెతెల్హాంలో' అని మేరీ భయం భయంగా సమాధానం చెప్పింది. లూసియస్, మేరీలు ఒకళ్ళనొకళ్ళు గుర్తించారు. లూసియస్ మాట్లాడకుండ వెళ్ళిపోయాడు. అతడా మెను మర్చిపోలేదు!

కొన్నేళ్ళతర్వాత జూడియాకు ఇద్దరు వ్యక్తులు వచ్చారు. రోమనుల నుండి తమదేశానికి విముక్తికల్గించి, రోమనులను పారద్రోలాలన్న ప్రయత్నంతో రహస్యంగా సైన్యం సమీకరించిన విప్లవవాది బరబ్బాస్ ఒకడు.

అదేసమయంలో జాన్ అనే మతాధికారికూడా జూడాలో ప్రవేశించి అందర్నీ చేసినతప్పులకు పశ్చా



[illegible]

త్తాపంపొందమని బోధిస్తూండేవాడు. ఎవరైనా దేవదూతవు నువ్వేనా అని అడిగితే నాకన్నా గొప్పవాడు అతి పవిత్రుడు నా తర్వాత వస్తాడు. ఆయన కాలిజోళ్ళు తుడిచేందుకు కూడా నే తగను అంటుండేవాడు.

ఒకరోజు జాన్ వద్దకు బాప్టిజం పొందేందుకు జీసస్ వచ్చాడు. జాన్ బాప్టిజం జీసస్‌కు ఇచ్చాడు. ఆరోజు అపూర్వమైన దినం. ఆ రోజునుండి రాజాధిరాజ శకం ఏర్పడింది! ప్రపంచానికి ఓ క్రొత్త వెలుగుబాట దొరికింది!

(సశేషం)

కాతనే నిర్మలకు ఆ నట్టింటకు ప్రవేశం లభించింది. కాని ఆ ప్రవేశంతో నిర్మలలోని "నైర్మల్యమే" పోయింది.

నరసమ్మగారి దేవుడిబొట్టు దరినే ఆమె గుండెల్లో గుండె, హృదయంలో గాయమూ అయిన చంద్రమౌళి ఫోటో ఉన్నది. చంద్రమౌళి నరసమ్మ "గారి సుపుత్రుడని" సూర్యానికి తండ్రి అనీ ప్రపంచం మెరుగును. అతగాడే నిర్మలకు కూడా తండ్రి అని కొంత ప్రపంచమే ఎరుగును. ఆ ప్రపంచం అక్కడ లేదు. నిర్మల చెప్పకపోతే ఆ సంగతి నెవ్వరూ నరసమ్మగారి లోగిలిలో ఆఖరికి నిరంజనంగారి విధవ్వ చెల్లెలు కూడా తెలుసుకోలేదు.

నిర్మల ఆవిధంగా తొట్రుపాటుతో పారిపోయి తనగదిలో కూలబడి పెట్టె తెరిచింది. ఆపిల్ల ట్రంకు పెట్టె తెరవగానే అందులోనుంచి చంద్రమౌళి ఫోటో కొట్టవచ్చినట్లు అగుపిస్తున్నది. నరసమ్మగారి యింట గల ఫోటోలో గంభీరంగా ఉన్న చంద్రమౌళి ఫోటో నిర్మల పెట్టెలో నవ్వుతూన్నట్టున్నది.

ఆ ఫోటోలో చంద్రమౌళి ఒక్కడే కాదు. ఆ ప్రక్కనే నిర్మల తల్లి సంజీవి కూడా ఉన్నది.

"నిత్యమూ యీ యిద్దరినేనా ? తను పూజ చేసుకొనేది ?"

కాని నిత్యమూ యీ యిద్దరినేగా నరసమ్మగారు తల్చుకుని కుమిలిపోయేది కూడా ....

చంద్రమౌళి తనను వెక్కిరించినట్లు సంజీవి తననే చూసి నిస్సహాయంగా నిలబడిపోయినట్లు తోచింది నిర్మలకు.

నిర్మల "భడాలు"న పెట్టె మూసేసింది. ఆపిల్లకు ఏదో భయం వేసింది.

ఎదురీదగల నిర్మల భయపడ్డది. విభాయించి లోకాన్ని కాదన్న నిర్మల దిగులుపడిపోయింది.

తను ఎవరో తెలియగానే, సంజీవి తన తల్లి అని తెలియగానే నరసమ్మగారి ఆత్మీయత అంతా ఏమవుతుంది ?

"సూర్యం మాష్టారు" తన నెంత నీచంగా చూస్తాడు. సూర్యం 'మాష్టారు'గా, నరసమ్మగారు ఇంటిగలావిడగా ఉన్నప్పుడు ఆపిల్లకు వారితో ఏర్పడ్డ అనుబంధం ఆత్మీయతా, తనకు ఆ కుటుంబంతో గల రక్తసంబంధం తెలియగానే ఏమవుతాయి ?

ఆ పిల్ల శారీరకంగా అక్కడ కుప్పలా పడి వున్నా "అన్నయ్యా" అని సూర్యాన్ని ఉద్దేశించి ఆక్రోశించింది ఆమె పిల్ల హృదయం.

తన అన్నయ్య సూర్యం. తనకొక సోదరుడున్నాడంటే లోకంలో ఎంత ధైర్యం .... ఎంత నిండు .... కాని .... నవ్వుకుంది నిర్మల .... తన నెవరు స్వీకరిస్తారు ? ....

అంతవరకూ నిర్మలకు తన గతమంతా తెలుసును. ఆపిల్లగురించి తెలియనిది నరసమ్మగారి లోగిలిలోని జనానికి మాత్రమే.

కాని ఆవేళ నిర్మలకు సైతం తన గతం అయోమయం మయిపోయింది.

"బహుశా యీ రహస్యమే .... తన తల్లి సంజీవిమీద ద్వేషమే, నరసమ్మగారి ఎదను ముల్లై సదా మెదులుతున్నదేమో ?......

సూర్యానికి ఆమె "నాన్నగారి గురించి, మా అమ్మగురించి" చెప్పలేదేమోనన్న అనుమానం కలి[illegible]

# విడీ విడని చిక్కులు

31-వ పేజీ తరువాయి

లయ్యాయి. అహంకారం, వ్యక్తిత్వం అడ్డు వచ్చాయి. తను సూర్యం దగ్గరకు వెళ్ళలే నను కుంది. తన సోదరుడే అయినా అక్కడ ఆయింట — తనకు స్థానం లేదనుకుంది నిర్మల.'

అంచేతనే రాజ్యలక్ష్మి వచ్చి నిర్మలక్కయ్యను చూద్దామనుకున్నప్పుడు నిర్మల గది తాళం వేసి ఉన్నది.

మరీ భయంకరంగా తోచింది రాజ్యలక్ష్మికది.

"అయ్యో ! నన్ను కూడా తీసుకొని వెళ్లితే బాగుణ్ణక్కా .... యిద్దరం వీళ్లకి దూరంగా పోదుముగా" అనుకుంది రాజ్యలక్ష్మి రెండు క్షణాలు అక్కడే నిర్మల గది గుమ్మంవద్ద నిలబడి.

రాజ్యలక్ష్మి అడుగులో అడుగు వేస్తూ నరసమ్మగారి యింటిముందు నిలబడ్డది. తలుపుకు చేరబడ్డది. ఆ యిల్లు తనకు ఆశ్రయం కాగలదనే

"ప్రతివాడూ కనీసం రెండు సందర్భాలలో నోరు మూసుకోవాలి."

"—ఏవో నేను; ఈతకొట్టేటప్పుడు, కోపమొచ్చినప్పుడు."

కామేశ్వరరావు (గుంటూరు)

ఆశ ధైర్యం ఆ పిల్లలో చెరిగిపోయాయి.

లోపల సూర్యం తననే పలవరిస్తున్నాడనీ, తననే విందిస్తున్నాడనీ, .... ఆ పిల్లకేం తెలుసు ?!

తలుపు వెరదలనిండ చీకటి. చుట్టూరా నిరాశలాంటి కరక్కాయ చీకటి. ఆకాశమంతటా మబ్బులు.

సూర్యం బావను తల్చుకున్న రాజ్యలక్ష్మికి ఆత్మహత్య చాలా కష్టమనిపించింది. ఐతే అంతకన్నా తనకు మరోమార్గ మేమిటి !

అదివరకు పెళ్లికి ఒప్పుకుని ఆత్మార్పణకు సిద్ధమైన ఆ పిల్ల మనసు నందుకు విస్పష్టంగా సాంబశివంగారే మార్చివేశాడు.

నిర్మలక్కయ్యలాగే తనూ పారిపోతే .... అదీ లాభంలేదు .... ఎవరికోసరం పారిపోవాలి ? ....

"చచ్చిపోతే" గాని సూర్యంబావకి తన మంచితనం తెలిసిరాదనుకుంది, నిర్మలహృదయ రాజ్యలక్ష్మి.

"ఏమైనా సరే తిరిగి లలితాంబ యింటి గడప తొక్కరాదు." అదే రాజ్యలక్ష్మి నిర్ణయం.

## 44

సూర్యం అటూ యిటూ మంచంమీద దొర్లుతున్నాడు. రాజ్యలక్ష్మి పెళ్లికి ఎందుకు ఒప్పుకున్నదో అతగాడికి అర్థం అవలేదు. పిడికిళ్లు బిగిస్తున్నాడు. అంతలో బేలగా బాధపడుతున్నాడు.

"ఈ పెళ్లికి ఒప్పుకోవద్దని నా ఎదుట పడితే రాజును నేను శాసిద్దును .... యింతకంటె నన్ను చంపినా తాను చచ్చినా బాగుణ్ను" అనిపించింది సూర్యానికి.

"అమ్మో ! రాజు చచ్చిపోదమా గుండెలు గుబేలు మన్నాయి" అమ్మో మా పెరట్లో పెద్ద నుయ్యి కూడా ఉంది."

సూర్యం గతుక్కుమన్నాడు. లేచి కూచున్నాడు. "బామ్మా ! బామ్మా ! అని అరుద్దామనుకున్నాడు.

'రాజ పెళ్లి ఆపేయ్ బామ్మా' అని అడుగుదామనుకున్నాడు.

రాజు పెళ్లికి ఒప్పుకోడం—అనక తనకు అ... పించకుండా వెళ్లిపోడం — ఆతర్వాత .... తను .. తను మీనాక్షిని .... "వీల్లేదు .... వీల్లేదు .... దిగ్గున లేచాడు. అటూ యిటూ పచార్లు చేశాడు మళ్లీ కూలబడ్డాడు. రాజు ఆ పెళ్లికి ఎందు ఒప్పుకోవాలి అన్న అహంభావమే గాని దా... తన చతకానితన మెంత కారణమో? సూర్యాని కళ్లల్లో నీళ్లు తిరిగాయి.

అంతలో అవతలనించి "గుభేల్" మని శబ్ద... వినవచ్చింది. సూర్యం పేడకల కరిగిపోయింది.

"రాజా !" గట్టిగా ఆర్తనాదంలా అరు... గుమ్మం తన్నుకొని, తలుపు తెరుచుకుని అవ... పడ్డాడు సూర్యం.

చీకటి చిందులు వేస్తున్నది తప్ప అవ... యేమీ లేదు.

అదంతా తన భయం ? అదంతా తన భ్రమ... తన ఆందోళనా ?

ఆకాశం మేఘావృతమైన నక్షత్రాలను ... సింది. చిక్కని చీకటి విడిసింది.

రాజ్యలక్ష్మి బావిలో పడలేదు అని నిర్ధా... చేసుకున్న సూర్యం ఒకసారి లలితాంబగారి యి... కేసి చూశాడు. చీకట్లో, మూసిన దర్వాజా ... తన రాజు కుక్కిమంచంలో విలపిస్తున్నదేమో ... పించింది.

తప్పదు. రాజు లోపల ఉండి తీరాలి .... అతని బలమైన కోర్కె.

తిన్నగా నరసమ్మగారి మంచం దగ్గరికి ... ఆమె పాదాలచెంతను కూచున్నాడు .... మన... చెయ్యి తగలగానే ఆమె లేచి కూచుంది.

సూర్యానికి ఆమె చేయి తన తల నిమి... దుఃఖం ధైర్యం ఆవేశం అన్నీ పెల్లుబికేయి.

"వీల్లేదు బామ్మా ! ఆపుచేసెయ్ బామ్మా రాజు పెళ్లిని ఆపుచేసెయ్ బామ్మా .... "

"రాజుని నన్ను మధ్యపెట్టి నన్ను ఒళ్లో... టనుచేసి మరొకరు ఎత్తుకు పోలేరు బామ్మా...

మగవాడు ఐపుండేన్నీ సూర్యం పసి... నరసమ్మగారి గుండెలు కరగడానికా అన్నట్లు... పించసాగాడు

ఆమె మమతను కాదనగల ఎత్తుకు... లేదు సూర్యం మనస్సు. అందుచేతనే సూర్య... భావాలను ఆమెదగ్గర ఇన్నాళ్లూ దాచుకుని రాజు... దగ్గరగా దాచేసి యిప్పు డీ బేలతనానికి... అయ్యాడు.

అతని వ్యక్తిత్వం బామ్మని కాదనగల ప... రాలేదు. ఐతే కరగకపోవడానికి నరసమ్మగారి... రాతిబండ కాదుగా ....

కాని జీవితంలో ఒకర్ని చెయిజాపి... నేరని నైజం ఆమెది. ఆవిడ జీవితయా... అన్ని యిక్కట్లు గక్కే అయినా, తల ది... వచ్చిన సందర్భాలు లేవు అని యింత... వచ్చాక ఎవరూ అనుకోలేరు గాని ....

# కాల్గేట్ వాడి నోటినించి దుర్వాసన రాకుండా చేసుకోండి
# రోజంతా దంతక్షయం రాకుండా కూడా కాపాడుకోండి!




ఎందుకంటె: ఒక్క సారి తోముకొంటేనే కాల్గేట్ డెంటల్ క్రీమ్ నోటిలో దుర్వాసన మరియు దంతక్షయమునకు కారణమైన సూక్ష్మ క్రిములను 85% వరకు తొలగించును.

కాల్గేట్ 10 మందిలో 7 గురికి నోటి దుర్గంధమును వెంటనే ఆపుతుందని మరియు భోజనము అవగానే కాల్గేట్ పద్ధతిలో పళ్లు తోముకొనుట ద్వారా ఎక్కువ మందికి ఎక్కువ దంతక్షయము అరికట్టిందని, దంత శాస్త్ర చరిత్రలో పూర్వము ఎన్నడూ తెలియనే యనంతటా శాస్త్ర పరిశోధనల ఫలితముగా నిరూపించబడినది!

ఊరికే నోటిలో నీళ్లు పోసుకొని పుక్కిలించుట చాలదు. భోజనము అయిన వెంటనే క్రమం తప్పకుండా కాల్గేట్‌తో పళ్లు తోముకోండి. దాని చురుకైన నురుగు పళ్ల మధ్య కనబడకుండా ఉండే సందులలోనికి వెళ్లి నోటి దుర్వాసనకు మరియు దంతక్షయమునకు కారణమైన కుళ్లి పోతున్న ఆహారపు తునకలను తీసివేస్తుంది!)

పిల్లలు కాల్గేట్‌తో పళ్లు తోముకొనుటకు యిష్టపడతారు. ఎందుకంటె చాల సేపు ఉండే దాని పిప్పరమెంటు వంటి రుచి అంటే వారికి ప్రీతి!

కాల్గేట్‌తో క్రమం తప్పకుండా పళ్లు తోముకొంటే
- ✔ నోటి దుర్వాసనను పోగొట్టును
- ✔ దంతక్షయమును నిరోధించును
- ✔ పళ్లను మెరుస్తూ ఉండేలా ఉంచును




మీకు పౌడరు కావాలంటే, ఈ లాభములన్నిటిని మీరు కాల్గేట్ టూత్ పౌడరు ద్వారా పొందగలరు ...ఒక డబ్బా నెలలు వస్తుంది!

**నోరు ఎక్కువ శుభ్రముగా, తాజాగా ఉండుటకు మరియు పళ్లు ఎక్కువ తెల్లగా ఉండుటకు ప్రపంచములో ఏ యితర పళ్లు తోముకొనే క్రీమ్ కన్న కాల్గేట్‌నే ఎక్కువ మంది వాడుతున్నారు**

## విడీ విడని చిక్కులు

ఇంతవరకూ ఆమె మాత్రం అవన్నీ తల ఎత్తుకునే నిభాయించింది.

ఆమె మనుమడి తల నిమిరింది.

"అబ్బ! యిలా అయిందన్నమాట చివరికి" అన్నది. "సర్వేశ్వరా!" అని నిట్టూర్చింది.

"ఇంతకూ వాళ్ళకులేని దుగ్ధ మనకు దేనికిరా!" అని లోకపుతీరు గుర్తెరుగ మన్నట్లు సూర్యాన్ని నోదార్చ జూసింది.

"రాజా నీకొద్దా బామ్మా" పసిపిల్లాడిలా అడిగాడు సూర్యం.

"బాగుందిరా .... అది నా యింట తిరుగుతూనే దీపంలా పెరిగింది గానీ .... "

మళ్లీ సూర్యం ఆమె వాక్యాన్ని పూర్తిచేయకుండానే ఆమె కాళ్లల్లో బుర్ర దూర్చి "నన్ను చంపు బామ్మా" అన్నాడు.

"ఛీ! ఏం మాటలవి? సరే .... కానీ! .... ఏనాడు నామాట చెల్లింది గనుక?" ఆమె సూర్యాన్ని తలఎత్తి కన్నీరు తుడిచి చెప్పింది. ఆమె ఆ మాటలను పెదవులను యాంత్రికంగా కదిపి అన్నదేగాని తక్షణమే ఆమె అంతర్యమంతా చీకటి అలుముకున్నది.

తను యిన్నాళ్ళూ ఏ చిక్కులన్నైతే విప్పుతున్నదో, వేటినైతే సమూలంగా తీసివేయాలనుకుంటున్నదో వాటినే మొదటికి తీసుకురావాల్సి వచ్చింది. ఏ సంప్రదాయాలకై ఆమె ఇన్ని త్యాగాలను మోసిందో అవి దక్కుతాయన్న హామీయే లేదన్నమాట యిక ....

ఆమె సూర్యాన్ని 'గతా' నికి ఎడంగా పరిస్థితులకు దూరంగా అన్నింటికీ అతీతంగా సాకింది.

మీనాక్షి తనకు "ఆయింటి కోడలే" ఐవచ్చినా, సూర్యం సుఖమే ఆమె కోరేది. లేదా రాజ్యలక్ష్మిని తన నట్టింట దీపంగా ఆమె అంగీకరించినా అదీ సూర్యం శుభం కోరే ....

ఆమెకు యింతదూరం వచ్చిన తరువాత బయురావంటే భయం పట్టుకున్నది. అతనితో వైరం కొరివితో తల గోక్కోడమే అవుతుంది.

పరువు ప్రతిష్ఠలకోసరం .... తన కొడుకు లోపాలను కప్పిపుచ్చి మనుమడి ఉనికిని శిష్ట సమాజంలో ఉన్నతంగా నిలవడం కోసరం ఆమె యిన్ని చిక్కులను బడబాగ్నులను ఎదను సంద్ర గర్భంలోలాగ దాచుకున్నది గాని చివరికి తన సూర్యం....తనచేతనే చేయిస్తున్న దేమిటీ?

ఆమె ఎన్ని కన్నీటి స్రవంతులకు కను కొలుకుల్లో 'కట్టలు' గట్టి నిలుపుకుని యీ ప్రాణిని పెంచిందో?

ఆ మమకారపు గుడ్డు సూర్యం విలపించడంతో ఆమెకు మమతా, దుఃఖమూ పెల్లుబికివచ్చాయి.

సూర్యం తలనిమిరి "సరే! తెల్లారనీ .... ఆ సర్వేశ్వరుడే ఉన్నాడ"న్నది నరసమ్మగారు నిట్టూర్చి ......

"నువ్వు దేవుడివి బామ్మా!....ఎంత మంచిదానివి బామ్మా!..." సూర్యం ఆమె పాదాలను కౌగలించుకున్నాడు.

**అయిపోయింది**

# ఆంధ్రసచిత్రవారపత్రిక

## పైవారం ప్రారంభం!

శ్రీ పి. గణపతి శాస్త్రిగారు

రచించిన

చరిత్రాత్మక నవల

## 'విశాల నేత్రాలు'

ఆంధ్రసచిత్రవారపత్రిక పాఠకులు చరిత్రాత్మక నవలలను ఎంతగా అభిమానిస్తున్నారో 'కవిసార్వభౌముడు' ప్రచురణ సందర్భంలో మాకు తెలిసింది. పాఠకులు చూపుతున్న ఈ ఆసక్తిని పురస్కరించుకునే ఇప్పుడు శ్రీ గణపతి శాస్త్రిగారి నవల ప్రచురించాలని సంకల్పించాము. 'విశాల నేత్రాలు' గ్రాంధికంలో కాక, వ్యావహారికంలో సాగిన రచన కనుక పాఠకుల ఆదరాభిమానాలు మరింతగా చూరగొనగలదని ఆశిస్తున్నాము!

విషయాలలో అభిలాష చూపినట్లు తాము ఊహించ లేదని చెప్పారు. నేరస్థులకోసం ప్రార్థనలు జరిపేది అన్నారు. వీరిద్దరితో ఎక్కువకాలం గడిపిందంటే వారు ఎంత పతనమైపోయిన వ్యక్తులో—హంతకులు కాబట్టే—తెలుపుతోంది అనుకున్నారుట.

వీరిద్దరిలో ఎడ్‌మీద ఆమె ఎక్కువ శ్రద్ధ చూపించటం వీరు గమనించారు. కాని, ఎడ్ అన్నదమ్ములలో పెద్దవాడూ, వారిద్దరిలోనూ ఒక రకమయిన 'నాయకుడూ' కనుక ఈ విషయం ఎవరూ అంతగా పట్టించుకోలేదు.

## ప రా రీ

జనవరి 30, 1902 వ తేదీ పొద్దున కేథరిన్ అన్నదమ్ములిద్దరినీ చూడటానికి వచ్చింది ఆ సమయంలో రక్షకభటులు ఎక్కువగాలేరు. ఇద్దరు మాత్రం గస్తీ తిరుగుతున్నారు. తక్కినవారు భోజనాల గదిలో ఉన్నారు.

కేథరిన్ తన దుస్తులకింద కొన్ని తాళంచెవులు,

# హంతకుని ఆప్తురాలు

21-వ పేజీ తరువాయి

ఒక చిన్న తుపాకి దాచుకుని వచ్చింది. గదిలో రెండు చిన్న పెట్టెలు ఉన్నాయి. వాటిలో కావలసినంత డబ్బు, ఆమె దుస్తులూ వగైరా, ఎడ్ జాక్ బిడిల్‌ల కోసం ఆమె భర్త సూట్లు రెండు ఉన్నాయి.

డ్యూటీలోఉన్న ఇద్దరు రక్షకభటులలో ఒకరివి వ్రుహతప్పేట్లు కొట్టారు. రెండవవానిని కాల్చేశారు. మొదటి భటుడు కోలుకుని 'అలారం' మోగించాడు. వార్డెన్ స్కోఫెల్ మొదట తన భార్యను హంతకులిద్దరూ బలవంతంగా తీసుకుని పోయి ఉంటారనుకున్నాడుకాని, ఆమె సామాను కొంత ఇంట్లో లేకపోవటంచూసి పోలీసువారికి కబురు పంపాడు.

చలికాలం కాబట్టి మంచు బాగా పడుతోంది. పరారీఅయిన ముగ్గురూ మంచులో ప్రయాణం చేసే స్లెయ్ (Sleigh) ఒకటి దొంగలించి పిట్స్‌బర్గ్ ఉత్తరంవైపుగా వెళ్ళిపోయినట్లు తెలిసింది. ఊరికి ఇరవై మైళ్ళదూరంలో ఖాళీగాఉన్న ఒక స్కూలులో ముగ్గురూ దాక్కొన్నారు.

బిడిల్‌సోదరులు లొంగదలుచుకోలేదు. తుపాకులు పేల్చటం మొదలుపెట్టారు. కేథరిన్‌వారికి సాయపడింది. కాని, త్వరలోనే జాక్ ఒక తుపాకిగుండు తగిలి చనిపోయాడు. గాయపడిన ఎడ్‌బిడిల్ కేథరిన్‌నికాల్చి, ఆమెతోబాటు కూలి పడిపోయాడు.

ఎడ్ మరణించాడుకాని, కేథరిన్ బ్రతికింది. మూడునెలలలో పూర్తి ఆరోగ్యం కోలుకుంది. హంతకుల పరారీకి తోడుపడినందుకు ఆమెకు రెండు సంవత్సరాలు—అదే జైలులో—కారాగృహవాసం శిక్షగా విధించారు. ఆ తర్వాత ఆమె జీవితం వివరాలు సరిగ్గా తెలియవుకాని, కేథరిన్ స్కోఫెల్ 1926 లో చనిపోయింది.



# మనము—మనదేహస్థితి

28-వ పేజీ తరువాయి

బాధఏర్పడినప్పుడు ఆ సెగ్మెంట్లనుండి బయలుదేరిన వెన్నునరములతో సంబంధంవున్న చర్మభాగంలో ఆ బాధ తెలుస్తుంది. జఠరాశయంలో అల్సరు ఏర్పడి చిల్లిపడినప్పుడు పెరిటోనియము (ఉదరమును కమ్మివుండేపొర) దానిని అంటుకుని




ఇన్‌ఫ్లేం అవుతుంది అప్పుడు ఆభాగానికి సంబంధించిన ఉదరభాగము ఒల్లలాగా బిగుసుకపోయి బాధపెడుతుంది. ఈ విధంగా బాధించే చర్మభాగములమీద కంది ఎర్రబడేటట్లుచేసే పట్లు వేస్తే లోపలవుండే నొప్పి కొంత ఉపశమిస్తుంది. అంతేకాదు ఆ చర్మభాగములను ఇరిటేట్ చేస్తే దానితో నరసంబంధంవున్న అంతరంగములు ఉద్రిక్తమౌతవి. మూత్రాశయము (Bladder) పనిచేయనప్పుడు బొడ్డు చుట్టూ రేవల్చిన్నిగంధముపట్టువేస్తే మూత్రము వస్తుంది. తలనొప్పిగా వుంటే అమృతాంజనము వంటి తైలమునో శొంఠిగంధమునో కణతలకు రాస్తే ఆబాధ తగ్గుతుంది. జలుబుచేసినప్పుడు కంటిలో కలికంవేస్తే శిరోభారం తగ్గుతుంది.

జీర్ణకోశవ్యాధుల లక్షణములు అర్థంచేసుకుంటానికి నరాశయ విజ్ఞానం చాలా అవసరం. స్వచ్ఛంద నరాశయములో సింపతెటిక్ గేంగ్లియాల వరసలు వెన్నుపాముకు రెండువైపులా వున్నవి. పేరాసింపతెటిక్ నరములు పైన మెదడుతోనూ క్రింద వెన్నుపాము చివరభాగముతోనూ సంబంధం కలిగివున్నవి వాటికీ అంతరంగములకూ సంబంధంవున్నది. సింపతెటిక్ వరుసలను మన యోగులు ఇడ, పింగళ అని వర్ణించారు. శిరస్సుకీ శరీరానికీ ఉండే నరబంధము రెండు రకములు (1) ఇచ్ఛాధీనము (2) స్వచ్ఛందము. అనిచ్ఛాధీన శరీరభాగములను ఇచ్ఛాధీనము చేసుకోవడమూ ఒకవిధమైన యోగాభ్యాసము. ఆవిధమైన అభిరుచివున్నవారిది గమనించడం మంచిది పేరాసింపతెటిక్‌భాగమును పరిశీలిస్తే సహస్రారమునకు మూలాధారమునకు ఉన్న సంబంధం తెలుస్తుంది.



# వెండిమబ్బు

17—వ పేజీ తరువాయి

త్యాన్ని నా కిచ్చేసెయ్. మీ ఇంట్లో నౌకరుగా ఉంటాను."

"నౌకరుగా ఉండటానికి అమెరికావరకు వెళ్లాలా?"

"నేను దేనికైనా సిద్ధమే..... నిన్ను పెళ్లి చేసుకోవటానికి తప్ప."

"ఇందిర భర్తగా ఉండటానికంటే ఇందిర నౌకరుగా ఉండటం మంచిది. అంతేనా ?" అంటూ ఇందిర కిలకిలా నవ్వింది.

మోహనుడు గాభరాగా ఆమెవైపు చూశాడు.

"నాకు పిచ్చెత్తలేదు. భయపడకండి. నా ప్రశ్నకు బదులు చెప్తారా?"

"అడుగు."

"నన్ను మీరు పెళ్లిచేసుకోకపోవటానికి కారణ మేమిటి ? మిమ్మల్ని అల్లుడిగా చేసుకోవాలి అనే ఉద్దేశ్యంతోనే విదేశాలకు పంపించారు నాన్న. ఇప్పుడు చదువు పూర్తిచేసి 'నన్ను విడుదల చెయ్యి' అనటంలోని భావమేమిటి ?"

"మీనాన్న ఇచ్చిన డబ్బును అప్పుగా ...."

"మా నాన్న వడ్డీవ్యాపారం చేసేవాళ్ల కోవకు చెందినవారు కాదు. ఇస్తే ప్రేమతో ఇస్తారు. లేదా ...."

"లేకపోతే?" — మోహనుడు కుతూహలంతో అడిగాడు.

"ధర్మార్థంగా ఇస్తారు."

చెంపమీద చెళ్లున చరిచినట్టయింది మోహనుడికి.

"మీ నాన్నగారి దానం నా కక్కర్లేదు" అన్నాడు తీక్షణంగా.

"దానం చేసినా యోగ్యత ఉన్నవారికే చెయ్యాలి. సత్పాత్రులకు ...... .... ...."

"ఇక చాలించు ఇందిరా."

"విదేశాల్లోని వన్నెల విసనకఱ్ఱలను చూసిన మీకు నేను అతిసామాన్యంగా కనపడుతున్నానా ?"

"ఉహుఁ. కారణం నాకు తెలీదు. నిన్ను పెళ్లి చేసుకోవటానికి నా మనస్సు అంగీకరించటంలేదు."

"మీరు ఇంకెవరినన్నా ప్రేమిస్తున్నారా ?"

"లేదు."

"విదేశాల్లో ఏదైనా గొడవచేసికొని వచ్చారా ?"

"లేదు."

"అయితే మీరు నిరాకరిస్తున్నదానికి కారణం తెలిసింది."

"ఏమిటి కారణం?"

"గిరి"

"మరి...."

"ఇక చాలు. నేనేమీ పసిపిల్లను కాను. రైల్వే స్టేషనులో మిమ్మల్ని చూసిన వెంటనే అనుకున్నాను — "నేను విదేశాలకు పంపిన మోహన్ కా డితడు. అదే దేహం, అదే పొడుగు, అదే రూపం కాని ఈ మోహనుడు వేరు. ప్రియురాలిదగ్గరకు తనంతట తాను వచ్చి వాలే ప్రియుడికి, బలవంతంగా, ఇహ విధిలేక వచ్చే మనిషికి వ్యత్యాసం కనిపెట్టలేనా ?"

"ఇంత సూక్ష్మం తెలిసిన నీకు నేను విదేశాలకు వెళ్లేటప్పుడు....."

సంకోచంతో మిగిలిన మాటలు మధ్యలోనే ఆగిపోయాయి.

"ఉహుఁ, అప్పుడు నేను తెలుసుకోలేకపోయాను. నాకోసమే నన్ను చేపట్టటానికి ఇష్టపడ్డా రనుకున్నాను. అదిగాక అప్పుడు నేను రెండేళ్లు చిన్నదాన్ని. ఈ రెండేళ్ల అనుభవం, జీవితం నాకు నేర్పింది. మీకు కావలసింది మా నాన్న ఆస్తి."

"ఇందిరా!"

"మా నాన్నకు ఒక్కతే కూతుర్నిగనుక అస్తంతా నాకే వస్తుందన్న నమ్మకంతో నన్ను పెళ్లిచేసుకోవటానికి ఒప్పుకున్నారు. మీ కళ్లలోని కాంతిని ప్రేమజ్యోతి అని భ్రమించాను. కాని, ఆనాడు మీ కళ్లలో వెలుగుతున్నది ధనదాహం."

మోహనుడు కొంచెం కోపంతో "అలాగే అనుకో. నీ అభిప్రాయాలతో నే నేకీభవించను. నన్నుగురించి నీ ఇష్టమొచ్చినట్టు అనుకో కాని నా దొక్కటే కోరిక. నన్ను విడుదలచెయ్యి" అన్నాడు.

ఇందిర తిరస్కారంతో "నేనేమీ మిమ్మల్ని కట్టివేయలేదే" అంది.

"ఐతే రేపే ఈ విషయం మీ నాన్నతో చెప్పనా?" ఆత్రంతో అడిగాడు మోహన్.

---

కారు ప్రమాదంలో ఒక పెద్దమనిషి కాలు విరిగింది. అతడు లక్షరూపాయలు నష్టపరిహారం కోరుతూ కారు యజమానిమీద దావా వేశాడు. కోర్టులో విచారణ ప్రారంభమైంది.

"లక్షరూపాయలే! ఎందుకండి పరాచకాలు! నా క్లయంట్ కోటీశ్వరు డనుకున్నారా ?" కారు యజమానితరఫు న్యాయవాది ఆశ్చర్యపోతూ అర్జీదారు న్యాయవాదిని సూటిగా అడిగాడు.

"మరి నా క్లయంట్ కు వంద కాళ్లున్నా యనుకున్నారా ?" రెండో న్యాయవాది తపీమని ఎదురుప్రశ్న వేశాడు."

సుమతీదేవి (ఒంగోలు)

---

"మీకు వెండిమబ్బులోనే ఐక్యమైపోవాలని ఉందా ఏం?" ఇందిర అడిగింది.

"అంటే?" మోహనుడు ఆశ్చర్యపడ్డాడు.

"మా నాన్నగారు నన్నెంత ప్రేమిస్తున్నారో మీకు తెలియదు. నిజం చెప్పాలంటే ఈ పెళ్లి ఆయన కిష్టంలేదు. నన్ను నొప్పించరాదనే ఒప్పుకున్నారు."

"ఊఁ"

"ఆయనకు నామీద ఎంత ప్రేమ ఉందో మీకు తెలుసా?"

"ఎంత ప్రేమ?"

"ఈ రాతితో నా పెళ్లి చేయించమని అన్నానంటే వెంటనే చేయిస్తారు. బానబొజ్జ రంగడిని ప్రేమిస్తున్నానంటే రేపే వాడికిచ్చి పెళ్లిచేస్తారు."

"సరే"—అన్నాడు మోహన్ అసహనంతో.

"కొన్నేళ్ల క్రిందటి సంగతి. అప్పుడు నాకు పన్నెండేళ్లుంటాయి. మామూలుగానే కత్తి చేతిలో పట్టుకుని తిరుగుతున్నాను. అప్పుడు ఇక్కడో కూలి మురుగ అని ఉండేవాడు. ఒకనాడు ఒంటిగా కనిపించిన నన్ను కొంటెమాటలతో ఏడిపించా అని చూశాడు. ఏమీతెలీని ముగ్ధావస్థలో ఉన్న నేను దిగ్భ్రమచెందాను. చేతిలోని కత్తితో వాడి వీపుమీద ఒక దెబ్బ వేసినాను. వాడు క్రింద పడ్డాడు. నేను ఏడుస్తూ ఇంటికి పరుగెత్తాను. దిక్కుతోచకుండా మానాన్నదగ్గరికి వెళ్లి జరిగిన విషయం చెప్పాను. మానాన్న ఉగ్రమూర్తియై లేచి బీరువాలోంచి పిస్తోలు తీసుకుని 'ఏడి వాడు ?' అన్నారు. అప్పటి ఆయన రౌద్రాకారం చూసి బెదిరిపోయాను. ఈ విషయం చెప్పకుండా ఉంటే బాగుండే దనుకున్నాను.

"ఎప్పుడు సౌమ్యంగా ఉండే ఆయనకు అంత కోపం రాగా నేను మరెప్పుడూ చూడలా.

"భయంతో మాట్లాడలేదు."

"ఊఁ. పద" — అని నన్ను గద్దించి చెయ్యి పట్టుకుని లాక్కుపోయారు.

"ఈ గొడవ తెలిసి కూలీలు మురుగడిని కనపించకుండా దాచారు. నాన్నగారు తోటంతా గాలించారు. చేతిలో పిస్తోలు పట్టుకుని ముందు ఆయన్న వెనుక ఏడుస్తూ నేను — తోటంతా మూడు ప్రదక్షిణలు చేశాం. ఆరోజు వాడు కనపడిఉంటే వెంటనే పిస్తోలుకు ఆహుతి అయ్యేవాడు.

"తరువాత పుట్టయ్య, మరికొందరు కలిసి మా నాన్నగారిని శాంతపర్చారు.

"వాడు తాగాడు. తెలివిలేక అలా చేశాడు" — అని చెప్పారు.

"తరువాత తోటలో అడుగుపెట్టే ధైర్యం లేకపోయింది మురుగడికి. ఒకమారు నాన్నగారు బెంగుళూరు వెళ్లినప్పుడు ప్రక్కతోటనుండి వచ్చి నా కాళ్లు పట్టుకుని క్షమించమని వేడుకొన్నాడు.

"చిన్నమ్మగారూ. తాగి తప్పుచేశాను. మీ కత్తితోనే నన్ను నరికేస్తే బాగుండేది. నా తప్పు కడుపులో పెట్టుకోండమ్మా."

"అమ్మ కూడా అతడిని ఓదార్చింది.

"ఏం చేయగలండా ? ఒక్కోసారి ఇలా అనుకో

## వెండిమబ్బు

నివి జరుగుతాయి. కాని నువ్వుమాత్రం ఆయన కళ్లబడకు. ఇందిరకు ఏవిధమైన అపకారం జరిగినా ఆయన సహించరు. ఒక్క చిన్నమాటు, ఇందిరకు ఏమీ కష్టం తగలకూడదు. ఇది గుడ్డి వ్యామోహమేమో అనిపిస్తుంది నాకు. ఇందిరను నొప్పించినవాడు ఈ భూమిమీద ఉండకూడదు. ఇది ఆయన అభిప్రాయం. కాస్త జాగ్రత్తగా మసులుకో—'' అని చెప్పి పంపించింది అమ్మ.''

చంద్రుడు నెత్తిమీద కొచ్చాడు.

వెన్నెల్లో భావోద్వేగపు వేడిమితో ఇందిర కళ్ళు ప్రజ్వలిస్తున్నాయి.

ఇందిరమాటలు విని చల్లని వెన్నెలరాత్రిలో కూడ అతడి వళ్లంతా చెమట పట్టింది. భయంతో దేహాద్యంతం వణికిపోయాడు.

''అయితే....అయితే....''

''మీరే ఈవిషయం నాన్నతో చెప్తే నా హృదయానికి తగిలిన దెబ్బ ఎలాటిదో ఆయన తెలుసుకుంటారు. మీకు ప్రాణంమీద ఆశ ఉంటే మీరు ఈ విషయం ఆయనతో చెప్పకండి.''

''ఇహ వేరే దారేముంది ?''

''నేనే చెపుతాను.''

''ఏమని చెప్తావు ఇందిరా ? మోహన్ నన్ను పెళ్లిచేసుకోవటానికి ఇష్టపడలేదనా ?''

''ఉహుం.''

''మరి ?''

ఇందిర క్షణకాలం ఆగి దీర్ఘంగా నిట్టూర్చి చెప్పింది.

''ఉహుం. అలా చెప్పను. 'మోహనుడిని పెళ్లి చేసుకోవాలనే అపేక్ష నాకు లేదు. ఆయన్ని ఎంచుకునేటప్పుడు పొరపాటుచేశాను. అతడితో నా జీవితం సుఖంగా గడవదనిపిస్తోంది' అని చెప్తాను.''

''ఇందిరా!''

''నేనే అలా చెప్పినట్టయితే......''

''ఊం.''

ఇందిర అతిప్రయాసతో చెప్పింది ''ఒకవేళ .... ఒకవేళ .... మనం దేహసంబంధం కలిగిఉన్నామని చెప్పినా మానాన్న నన్ను మీకిచ్చి పెళ్లి చేయరు. ఆ ధైర్యం, ఆ నమ్మకం నాకుంది.''

''ఇందిరా!''

''ఆయనప్రేమే ఒక్కోసారి నన్ను భయపెడ్తుంది. నేను ఎప్పుడూ మిమ్మల్ని కట్టి ఉంచాలని ప్రయత్నించలేదు. మా నాన్ననుండి తప్పించుకోవాలంటే మీకున్న దారి ఇదొక్కటే. మీరు ఆయనముందు తప్పంతా నాదే అయినట్టు ప్రవర్తించండి. నన్ను పెళ్లిచేసుకోవటానికి ఆత్రంగా ఉన్నట్టు నటించండి. నన్ను వదలివెళ్లటం మీచేత కాదన్నట్లు అభినయించండి. మొత్తంమీద నాయికచేత తిరస్కరింపబడిన భగ్నప్రేమికుడవ్వాలి మీరు.

''ఇందిరా !'' అంటూ మోహనుడు రాతిమీద నుండి దూకి ఇందిర దగ్గరకొచ్చాడు.

''ఆగండి.'' అంది ఇందిర అధికారస్వరంతో.

మోహనుడు అక్కడే నిలబడ్డాడు.

ఇందిర రాతిమీదినుండి దిగి నీళ్లలో ఒక్కొక్క అడుగువేస్తూ ముందుకు వచ్చింది.

వెన్నెలకాంతిలో ఆమెమొహం తెల్లటి ముఖ్యలా పాలిపోయి ఉండటం గమనించాడు మోహన్.

"ఇందిరా !"

"ఇహ మాట్లాడే ఓపిక లేదు నాకు. నా మానానికి నన్ను వదలండి" — అని తిరిగి చూడకుండా చక చకా నడిచింది.

తోటపరిచయం ఉన్న ఇందిర కళ్లుమూసుకున్నా సులువుగా నడిచిపోగలదు.

తన యోచనలతో ఒళ్లు మరచిన ఇందిర ముందుకు సాగింది. హృదయంలో రేగిన తుఫానుని అదుపులో పెట్టుకోటానికి శాయశక్తులా ప్రయత్నిస్తోంది ఇందిర.

'ఇందిరా .... " అన్న ఆర్తనాదం ఆమెను ఈ లోకంలో పడేసింది. వెంటనే వెనుదిరిగి చూసింది.

నరికి పడేసిన చెట్టు తగిలి మోహనుడు సుమారు ఇరవై ఐదు అడుగుల క్రిందఉన్న గుంటలోకి దిబ్బనుండి జారిపడిపోయాడు.

పిడుగు పడ్డట్టయింది ఇందిరకు. మరుక్షణంలో మేలుకుని దిబ్బమీది నుండి క్రిందికి పరుగెత్తింది.

అతని దేహం రాతికి కొట్టుకున్నప్పుడు 'అమ్మో' అని కేక వేశాడు మోహన్.

ఇందిర ఊపిరి బిగపట్టి పరిగెత్తింది.

తన దగ్గరకు వస్తున్న ఇందిరను చూశాడు మోహన్. ఆమెను పట్టుకునేందు కన్నట్టుగా తన కుడిచేతిని ముందుకు చాచాడు. మరుక్షణంలో స్పృహతప్పింది.

ఇందిర మోహనుడిదగ్గర కూర్చుని చెవిలో 'మోహన్' అని పిల్చింది.

అప్పుడే అతనికి స్పృహలేదన్న విషయం తెల్సింది.

అంతవరకూ నిగ్రహించుకున్న భావాలన్నీ అశ్రురూపంలో చెంపలమీద ప్రవహించాయి.

ఆమె అతడి నాడిచూసి, గుండెమీద చెవిపెట్టి గుండె కొట్టుకోవటాన్ని జాగ్రత్తగా విన్నది.

ప్రాణముందని తెలిసి కాస్త ధైర్య మొచ్చింది.

వణికే చేతులతో అతడి బుగ్గలను నిమిరింది. నుదుటిమీద చిన్నగా ముద్దుపెట్టుకుని అక్కడి నుంచి పరుగుతీసింది.

శరవేగంతో పరిగెత్తుకువచ్చిన కూతుర్ని చూసి రావుగారు అదిరిపోయారు.

"ఏమయింది ఇందిరా ?"

"మోహన్ .... మోహన్ .... "

"ఊఁ—ఏం జరిగింది ?"

"మోహన్ గుంటలో పడిపోయారు. స్పృహ తప్పిపోయినట్టుంది."

రావుగారు గాబరాగా పుట్టయ్యను పిల్చారు.

ఐదారుగురు నౌకర్లు టార్చిలైట్లతో బయలుదేరారు.

అరగంటలో వారు చైతన్యశూన్యుడయిన మోహనుడిని ఎత్తుకుని వచ్చారు.

రక్తంలో తడిసిన అతడి గుడ్డలయూ, దేహాన్నీ చూడలేక కళ్లు మూసుకుంది ఇందిర.

రావుగారు డాక్టరుకోసం కారులో చిక్కమగళూరు వెళ్లారు.

పుట్టయ్య గాయాలనుండి కారుతున్న రక్తాన్ని తుడిచి తనకు తెలిసిన ఆకురసం పిండాడు.

ఇందిర మతిలేనిదానిలా మోహనుడి తలదగ్గర కూర్చుంది.

"ఏం ఫరవాలేదమ్మాయ్. భయపడకు. పడ్డ కంగారుకి స్పృహతప్పింది. అంతే."

"ఆయనకేమీ కాదుగదా ?"

"ఏమీకాదు తల్లీ. మోహనుడి ప్రాణానికి నా ప్రాణం అడ్డు వేస్తాను. ధైర్యంగా ఉండు."

"నాకేం తోచడంలేదు పుట్టయ్యా !"

"నువ్వు పడుకో ఇందిరా. నేను చూసుకుంటా."

ఇందిర అక్కడనుండి కదల్లేదు.

డాక్టరుగారు వచ్చారు.

దేహంపైన అయిన గాయాలకు మందు వేశారు.

"ఎముక విరిగిందేమో ఒకసారి చూడటం మంచిది. పైనుండి పడ్డారు చూడండి. ఇప్పుడు



వెర్లెక్ట్ చెయ్యరాదు. ముందు స్పృహరానివ్వండి. తర్వాత ఎక్స్‌రే తీయించాలి."

"ప్రాణానికేం అపాయం లేదుకదా ?"

—రావుగారు అడిగారు.

"ప్రాణానికేం భయంలేదు. పడిన షాక్‌కు స్పృహ తప్పింది."

డాక్టరుగారు తమపని చూసుకుని వెళ్లిపోయారు.

ఆరోజు ఇంట్లో ఎవరూ భోంచేయలా. అల్లుడి కోసం చేయించిన రకరకాల పిండివంటలు, వంట అంతా ఇంట్లో పాలేర్లు పంచుకున్నారు.

మోహనుడి మంచంవద్ద కుర్చీలో కూర్చున్న ఇందిర అక్కడనుండి కదలలేదు.

ఆమె అంతరంగమే ఆమెను లోలోపల బాధ పెడుతోంది. తన అజ్ఞానంవల్లనే అతడు పడ్డాడు అనే భావం ఆమెను క్రుంగదీస్తోంది. మోహనుడి మీద తను ఈవిధంగా పగతీర్చుకోవాలా ?

అతడు గుంటలో పడాలన్న భావంతో తను ముందుకు వెళ్లిపోలా.

అతడు తనహృదయానికి పెట్టిన చిచ్చుతో దిక్కు తోచకుండా ఇందిర ముందుకు నడిచింది.

కాని తప్పు తనది.

తన్నుతాను ఎప్పటికీ క్షమించుకోదు.

రావుగారు కూతుర్ని వెళ్లి పడుకోమన్నారు.

"నేను ఇక్కడ ఉంటానమ్మా. నువ్వు వెళ్లి పడుకో ఇందిరా."

"ఆయనకు స్పృహవచ్చేదాకా నేను ఇక్కడే ఉంటాను నాన్నా."

"ఫరవాలేదు, నువ్వు పడుకో తల్లీ. నాకు నువ్వు వేరు, మోహన్ వేరూ కాదు."

"నువ్వు మోహనుడిని అంత ప్రేమిస్తున్నావా నాన్నా ?"

ఇందిర ప్రశ్న రావుగారికి విచిత్రంగా తోచింది.

"నీకు అతడిమీద ఎంతప్రేమ ఉందో నాకూ అంతే ఉందమ్మా. నీనుండి అతడు, నీకోసం అతడు నాకు ప్రియమైన వ్యక్తి అయ్యాడు."

ఇందిర మాట్లాడలేదు.

కళ్లు మూసుకుని పడున్న మోహనుడిని ముఖాన్ని చూస్తోంది.

ఎంత అందమైన మోహం ! ఆ మోహంవెనక ఎంత అల్పబుద్ధి.

అతడు తనను ప్రేమించలేదని, తన్ను పెళ్లి చేసుకోబోవటంలేదని అలా హీనపర్చాలా ?

ఎంత అల్పబుద్ధి తనది ?

అతడికి తను చేస్తున్నది సరి అని అనిపించి ఉండవచ్చు. కాని తనకదే క్షమింపరాని అపరాధంగా కనిపించవచ్చు.

మోహనుడు మొదటిలాగా అయ్యేవరకు తనకు శాంతి సమాధానాలు ఉండవు

శిక్ష అనుభవించేది నరకంలోనే కాదు.

తప్పుచేసినవాళ్లకు శిక్ష విధించేందుకు న్యాయస్థానాలే అక్కర్లేదు.

# వెండి మబ్బు

మనసులో జరిగే విప్లవంకంటే మనిషికి వేరే శిక్ష ఉందా ?

"పడుకో ఇందిరా !"

"నేను పడుకోలేను నాన్నా. క్షమించు."

రావుగారు చేసేదిలేక లేచి వెళ్లారు.

రాత్రంతా ఇందిర అలాగే బెడ్‌లైటు వేసుకుని కూర్చుంది. అరేగదిలో ఒక మూలగా చాప మీద పడుకుని చిన్నగా గురకపెడుతున్నాడు పుల్లయ్య.

రావుగారు అప్పుడప్పుడు వచ్చి చూసి పోతూనే ఉన్నారు.

తెల్లవారుఝామున మూడుగంటలకు మోహనుడికి తెలివివచ్చింది.

---

తాను చూపిన రెండు మూడు 'పాయింట్సు' జడ్జీ త్రోసివేసే సరికి న్యాయవాదికి చిరాకేసింది. కోపంగా కాగితాలు సర్దుకుంటూ వెళ్ళడానికి సిద్ధమయ్యాడు.

"ఈ కోర్టు తీర్పు అంటే మీరు ఎంత నిర్లక్ష్యమో తెలియజేయాలని చూస్తున్నారుకదూ?" జడ్జీ మందలింపుగా అడిగాడు.

"లేదండీ ! ఆ నిర్లక్ష్యాన్ని కప్పిపుచ్చేందుకే ఈ ప్రయత్నం" న్యాయవాది జవాబు వెతుక్కోలేదు.

సోమయాజులు (హైదరాబాదు)

---

మోహనుడు మూలుగుతూ పక్కకు పొర్లినప్పుడు ప్రక్కనే కూర్చుని చిన్నగా కునుకు దీస్తున్న ఇందిరకు మెలకువ వచ్చింది.

ఇందిర వంగి మెల్లగా పిల్చింది. 'మోహన్'

మోహనుడు మొదట మాట్లాడలేదు. ఇందిర మరి రెండుసార్లు పిల్చాక "ఎవరూ ?" అన్నాడు క్షీణంగా.

"నేను. ఇందిరను."

అతడి కంతా గుర్తుకు రాసాగింది. తమిద్దరి మధ్య జరిగిన సంభాషణ, తరువాత తను పడటం అంతా గుర్తుకు వచ్చింది.

"కంగారు పడకండి. డాక్టరుగారొచ్చి చూసి వెళ్లారు. పెద్ద దెబ్బ తగలలేదు." అంది ఇందిర.

మోహనుడు మూలిగాడు.

"రేపు హాస్పిటల్‌కు తీసుకువెడతారు. ఇప్పుడు పాలుతాగి పడుకోండి. ఇవ్వనా ?"

"ఒద్దు."

"కొంచెం పాలు, పళ్లు తీసుకోండి."

"ఉహుఁ. నాకేమీ ఒద్దు. నేను మా ఊరికి వెళ్లిపోతాను. నన్ను పంపించెయ్."

"అలాగే మీకు నయమయిన వెంటనే వెళ్లి పోదురుగాని."

"కాదు నన్ను ఇప్పుడే పంపెయ్—" మోహనుడు మొండికేశాడు.

"ఈ అర్ధరాత్రి ఎలా వెడ్తారు ?"

"నేను వెడ్తాను" — అంటూ లేవటానికి ప్రయత్నించాడు మోహన్.

"దయచేసి పడుకోండి" అంటూ ఇందిర అతడిని పట్టుకుని పడుకోబెట్టింది. అతడి నుదుటిమీద చేయివేసి చూసింది.

జ్వరంతో అతడి ఒళ్లు కాలిపోతోంది.

తన నుదుటిమీద ఉన్న ఇందిర చల్లని చేతిమీద తన కాలిపోతున్న చెయ్యి ఉంచి 'అమ్మా' అని మూలిగాడు మోహన్.

ఇందిర చటుక్కున చెయ్యి వెనక్కి తీసుకుంది.

లేచి పెద్దలైటు వేసి ఫ్లాస్కులోంచి గ్లాసులోకి పాలు వంచి "త్రాగండి" అంది.

"ఉహుఁ. నాకొద్దు."

"నన్ను మా ఊరికి పంపించేసెయ్ "

"మోహన్, నామాట వినండి. ఇప్పుడు రాత్రి. తెల్లవారగానే మీ ఊరికి పంపిస్తాను."

"ఖచ్చితంగానా ?"

"ఊఁ. ఇప్పుడు పాలు త్రాగండి."

మోహనుడు కొంచెం మెత్తబడి పడుకునే పాలు తాగాడు.

"ఇక నిద్రపొండి."

"ఉదయం నన్ను పంపించేయండి!"

"అలాగే."

"తరువాత అడినమాట తప్పకూడదు."

"ఈజన్మలో నా కాగుణం రాలేదు."

క్షణమాత్రంలో మోహనుడిమోహం ఎర్రబారి వెంటనే తెల్లబడిపోయింది. ఏమో చెప్పాలని నోరు తెరచి మళ్ళీ ఆమాటను తనలోనే మ్రింగివేశాడు.

కాస్సేపు ఊరుకుని

"నువ్వు వెళ్ళిపడుకో." అన్నాడు.

"నా యోగక్షేమంగురించి మీరేం విచారించకండి."

"అర్ధరాత్రి దాటిందనుకుంటా."

"మరేం ఫరవాలేదు. మీరు పడుకోండి."

"రేపు ప్రొద్దున్న...."

"అలాగే ప్రొద్దుట మీరు వెళ్ళగలిగితే వెళ్ళుదురుగాని."

మోహనుడు తృప్తిగా పడుకుని నిద్రపోయాడు.

ఇందిర కుర్చీమీద కూర్చుని అతన్నే చూస్తూ ఉంది.

(సశేషం)



అలంకార్ చిత్రవారి 'విక్రమార్కవీరుడు'లో పద్మిని.

# చిత్ర భేదము

16-వ పేజీ తరువాయి

మనవాళ్ళ సినిమాలూ, మనముగానూ. ఒక్కమాట చెబుతా వినండి 'మనవా ళ్ళొట్టి వెధవలోయ్' అన్నాడు గిరీశం— మీ కెవరన్నా తెలుసా ?" అన్నాడు సలహా

"నాకు తెలుసు" అన్నాడు వెంటనే ఫలానా.

"అంటే నీతో అన్నాడా ?"

"నాతో అనలా"

"మరింకేం ?"

ఇదేమిటో నిర్మాతకు తెలుసుకోవా లనిపించింది.

"ఎవురా అన్నది ?" అని అడిగాడు.

"గిరీశం అండీ మన 'కన్యాశుల్కం' నాటకంలో —మీరివన్నీ ఎక్కడ చదువుతారూ ? అది అసలు మాంఛి నాటకంలెండి అదెవరూ, చిలకమర్తి వీరే లింగమో, కందుకూరు అప్పారావో ఎవరో రాశారు. అబ్బ—ఏం జ్ఞాపకం ఉంటుందీ— వీళ్ళందర్నీ ఎక్కడికని గుర్తుపెట్టుకోటం ! చదివే పుస్తకాలు ఒకటా రెండా ? దానికి తోడు రైటర్లు పేర్లు ఎక్కడ గుర్తుంటాయి కాని—సరే, దిస్ వీరేశలింగం రోట్ ద డ్రామా—'కన్యాశుల్కం' అని పేరు " అన్నాడు సలహా

"గురజాడ కదండీ అది రాసింది" అన్నాను నేను

"కానీ—కన్యాశుల్కం గురించి నేను మాట్లాడుతున్నాను—సరే, దాంట్లో గిరీశం అని ఒక పాత్ర. వాడి దుంపతెగా "

"హేపీ ఎండింగు గురించి చెప్పబోతున్నారు మీరు" అని గుర్తుచేశాడు రచయిత.

"యస్ యస్ హేపీ ఎండింగ్. చూశారా, టాపిక్ ఎట్లా మారిపోతోందో—అంతేనండీ—వెధవది—ఎక్కడలేని సబ్జెక్టులూ మనం డిస్కస్ చెయ్యటం నుంచి, ఈ చిక్కు వస్తున్న దను కొంటాను ఒకదాంట్లోంచి ఇంకో దాంట్లోకి 'డ్రైవ్' చేసేస్తూ ఉంటుంది—సబ్జెక్టు—అందుకనే వాటెడ్మిని లిమిట్ చేసేసుకోవాలి. చేసేసుకుంటే, సహోజ్ మనకు ......"

"హేపీ ఎండింగ్ గురించి చెప్పబోతున్నారు మీరు" అన్నాడు రచయిత మళ్ళీ.

"ఆఁ ! అదే—చెబుతున్నాను. ఉదాహరణకు— మన సినిమా కథల్లో మధ్యలో ఒక ... వస్తాడనుకోండి ఏదో ఉత్తరం ఇచ్చి వెళ్ళిపోతాడు అంతేనా అతని పాత్ర ? మళ్ళీ కనిపించడు ఏమయ్యాడో నసే సందేహం ప్రేక్షకులను బాధిస్తూనే ఉంటుంది చివర్లోనన్నా రాకపోతాడా అనుకుంటారు రాడు ! వాళ్ళ కో పెద్ద డిసపాయింట్ మెంటు! మరి, హేపీ ఎండింగు ఎట్లా అయింది అది ! అంచేత, మీరు చూపించిన పాత్రలన్నీ చివరకు తీసుకురావలసిందే ఏ పాత్రనూ మధ్యలో వదిలెయ్యరాదు చివరి కొచ్చేసరికి, బాగా జనం ఎక్కువయిపోయి, సెట్టు క్రిక్కిరిసి పోతుందంటారా— ఏం భయంలేదు కాస్త పెద్ద సెట్టు వేసి—ఆ ఆఖరిసీను మాత్రం — విస్టావిజన్‌లోనో, వైడ్ స్క్రీన్‌లోనో తీస్తాం, అందరూ క్లియర్‌గా కనిపించేట్టు" అన్నాడు సలహా

"అట్లా అయితే మధ్యలో ఒకవంద మంది రోడ్డుమీదనుంచి పోతున్నట్టు రాశారు. వాళ్ళంతా కూడా రావాల్సిందేనా?" అన్నాను నేను

"రావాల్సిందనేగా నా పాయింటు లేదూ, అసలా వందమందినీ తీసిపారేయండి"

"సరే, కథలోవున్న వీక్‌నెసెస్ చెప్పారు కారు" అన్నాడు కవి

"ఇదొకటి—ఫస్టు పాయింటు ఇందా— టెంపో లేదు, డ్రామా లేదు, సీనరీ లేదు, క్లయిమాక్సుచాలదు" అన్నాడు సలహా

"నాటినాటకంటే ముఖ్యం డ్రామా లేదు" అన్నాను నేను

"ఏందయ్యా డ్రామా లేదంటారు — నాయకుడూ నాయకురాలూ కాలేజీలో డ్రామా ఆడతారని సదివాడుగా" అన్నాడు నిర్మాత చిరాగ్గా.

"డ్రామాఅంటే అదికాదు, నిర్మాతయ్యా,సట్టు. మాంఛి పూవు" అన్నాడు ఫలానా.



వాహిని స్టుడియోస్ 'ఆత్మబంధువు' లో రామారావు, సావిత్రి.

క్కర్లు తీసుకొస్తాను అన్నట్టు, కవీ, సినిమాటికి పోనుందా?" అడిగాడు సలహా

"లేదు, ఏం?"

"అయితే ఇబ్బందే మ్యూజిక్ డైరెక్టరు రిహార్సిల్సుకు ఇక్కడికి రాడు. అతనికి మాటల్ని ఫోన్‌లో చెబుతూవుండాలి అత నట్లాగే ట్యూన్ చేస్తూ ప్లేబాకువాళ్లకు ట్యూనంతా ఫోన్ చేస్తాడు"

"వాట్!" అన్నాను నేను

"వాట్ అనగానేమి వస్తా" అనిచరచరా వెళ్లిపోయాడు సలహా మేమంతా ఒకరిమొహంలో వుండే రియాక్షన్‌ను ఇంకొకరు పరిశీలిస్తున్నాం. ఇంతలో బయటకు పోతున్నవాడు— మళ్లీ పెద్ద కేకవేశాడు—" కవీ! ఆ హీరోయిన్ సెంటిమెంట్సును పాడుచెయ్యకు అవే చిత్రానికి జీవాలు, ఈసంగతి రహస్యం! ఎవరికీ తెలియనివ్వకండి అని పబ్లిక్ హోటల్లో అరుస్తూ వెళ్లిపోయాడు.

"అదావుడోడు!" అన్నాడు నిర్మాత.

"సరే—నాకు అండర్‌గ్రౌండు తవ్వించండి—ఈ హోటలుక్రింద," అన్నాడు కవి

"ఏం దధి?"

"అండర్ గ్రౌండులోకి పోవలసిందే నేనింక; తవ్వించండి గొయ్యి"

"ఇదేందయ్యా—సలహా లేడుగదా—ఇదేంది తవ్వించమంటావు?" అని బిత్తరపోయాడు నిర్మాత

"అదేంకాదులెండి. ఆయన ఇంకో మూడ్‌లోకి పోయేటంయుమయింది. బహుశా పోయేవుంటాడు—అందుకనే తవ్వించమంటున్నాడు" అని నవ్వాను నేను మా యిద్దరికీ పిచ్చెత్తిందేమోనని, వెర్రిగా చూడసాగాడు నిర్మాత.

"అండర్ గ్రౌండంటే, మామూలుగా ఏదన్నా హోటలన్న మాటండి ఆయన ఒంటరిగా అక్కడ కూచుని రాస్తాడు. రాత అయేదాకా బయటకు రాడు అంతే!" అన్నాను నేను.

"అదా— నా కొంపతవ్వివ్వారు గదయ్యా" అన్నాడు నిట్టూరుస్తూ నిర్మాత ఇంతలో ఫలానా వచ్చాడు.

"ఎటుపోయినావురా— రిసర్వుకా?" అన్నాడు నిర్మాత.

"రిసర్వుకే గురూగారూ! ఇప్పట్నుంచే రిజర్వేషన్ చేసుకోవాలి లేకపోతే టిక్కట్లు దొరకవు. అందుకనే వెళ్లాను. ఇంకో సంవత్సరం పోయాక



అంజలీ పిక్చర్సువారి "స్వర్ణమంజరి"లో రాజనాల

కౌసల్య ప్రొడక్షన్స్‌వారి "నువ్వా — నేనా?" లో దేవిక.

## ఆంధ్ర సచిత్ర వారపత్రిక

# వనితాలోకం వ్యాస రచన పోటీ

## (దీపావళి ప్రత్యేక ఆకర్షణ)

# 'రాజకీయాలలో స్త్రీల పాత్ర'

ప్రాచీన కాలమునుంచి భారతీయ మహిళలు సమాజ జీవితంలో నిర్వహిస్తున్న పాత్ర అనల్పమయినది. వారి బహుముఖ ప్రజ్ఞా సామర్థ్యాలు అన్ని యుగాలలోనూ రాజకీయాది వివిధ రంగాలలో ప్రస్ఫుటంగా వ్యక్తమయ్యాయి. మైత్రేయి, గార్గి వంటి బ్రహ్మవాదినులు, రుద్రమ దేవి, ఝాన్సీ లక్ష్మీబాయి వంటి వీరవనితలు, మొల్ల వంటి సాహితీపరులు చరిత్రలో చిరస్మరణీయులు.

మహాత్ముని నాయకత్వాన సాగిన స్వాతంత్ర్య, సంస్కరణోద్యమాలలో ఎందరెందరో మహిళలు తమ ధైర్య సాహసాలను, సంస్కరణాభిలాషను నిరూపించుకున్నారు. సరోజినీ నాయుడు, దుర్గాబాయ్ గారలు ఉత్కృష్టమైన సేవచేసి నారీలోకానికే ఆదర్శప్రాయులయ్యారు.

మనది ప్రజాస్వామ్యం కనుక దేశ పురోభివృద్ధికి పాటుబడే అవకాశాలు స్త్రీలకు ఈనాడు ఉన్నన్ని మును పెన్నడూ లేవు. పాశ్చాత్య భావాల ప్రభావంవల్ల ఈ అవకాశాలు నానాటికీ ఎక్కువ అవుతున్నాయి.

ఈ పరిస్థితులలో స్త్రీలు రాజకీయ రంగంలో నిర్వహించ వలసిన పాత్ర ఎలాంటిది? రచయిత్రులు తమ వ్యాసాల్లో ఈ విషయం చర్చించి పోటీ జయప్రదంచేయగలరని ఆశిస్తున్నాము.

## మొదటి బహుమతి రు. 75

## రెండవ బహుమతి రు. 50

## మూడవ బహుమతి రు. 25

### నిబంధనలు

- ★ కవరుపైనా, వ్రాతప్రతిపైనా 'వనితాలోకం దీపావళి పోటీకి' అని స్పష్టంగా వ్రాయాలి.
- ★ రచన 4 అరఠావు పేజీలు మించరాదు. కాగితం ఒకవైపుననే వ్రాయాలి,
- ★ బహుమతులకు అర్హములు కాని వ్యాసాలు కూడా ప్రచురణకు యోగ్యమైనవైతే ఇతర సంచికలలో ప్రచురిస్తాము.
- ★ రచనలు తిప్పి పంపగోరువారు తగినపోస్టేజితో తమ చిరునామాతల కవర్లు జతపరచి పంపాలి.
- ★ వ్యాసాలు 31-8-62 లోగా మా కార్యాలయం చేరాలి.
- ★ పోటీలో తుది నిర్ణయం సంపాదకులదే ఈ సందర్భంలో ఏ విధమైన ఉత్తర ప్రత్యుత్తరాలకూ అవకాశం లేదు.

# హరివంశం

11 వ పేజీ తరువాయి

తెలిసి వానిపై కోపము చేసితివి?"

"వాడు నిజముగా కాశికను వదిలి పోవునందువా?"

"అంతయు సుదక్షిణాదేవిపై ఆధారపడి యున్నది."

పౌండ్రకుడు గల్లున నవ్వినాడు. "వాచాలా! నేనును అదియే అనుకొన్నాను. వాడు కాశికను వదిలిపోడు. నాకును, వానికిని ఇంత యప్పటి నుండియు స్నేహము. వాడు నన్ను వదిలి వెళ్ళునా! వాడు నిజముగా పోవుచో!......"

"వాసుదేవ! తమకు ఉత్తమసారథి లేని లోపము వాటిల్లును."

పౌండ్రకుడు ఆలోచనాధీనుడయ్యెను. ఆలోచించుచు ముందునకు నడచుచుండెను. వాచాలుడును ఆయనను అనుసరించెను. వారట్లెంత దూరము నడచిరో వారికి తెలియదు. తెలియు వేళకు కోట గోడలను ఒరసి పారుచున్న గంగా నదీజలములు చేయుచున్న గలగలలు ఒరపిడితో కూడి వినబడెను. చీకటిలో ఏమియు కన్పించుట లేదు. రాజు బయలుదేరెననగా, రాత్రివేళల, కరదీపికలవారు వెంట నుందురు. మరి వారికి రాజిట్లు బయలుదేరెనని తెలియదు.

"వాసుదేవ"

"వాచాలా!"

"మనము చాలదూరము వచ్చితిమి."

"అవును!"

"కరదీపికలవారిని పిలతునా!"

"వద్దు."

వాచాలుడు మరల మాటాడలేదు. ఆ చీకటిలో పౌండ్రకుడు కోటగోడలకు మెట్లున్న తావును వెదకి, గోడలపైకి పోయెను. అచ్చటనుండి తెల్లని గంగ నల్లగా అతని కగుపించెను. అగుపించుటయనగా, స్థలమున్నయెడల చీకటి యొక్క విధముగను, జలమున్నయెడల మరియొక్క విధముగను నుండెను. అది అట్లుండుట నతడు కన్నులచేత అనుభవించెను. తల ఎత్తి చూడగా మేఘములేని ఆకాశము నీలమై కన్పించెను. నక్షత్రములేరి అలంకారములతో కన్పించెను. అతని కప్పుడు ఒక విచిత్రమైన భావము తోచినది. బంగారపు రేకులను గంధములో కలిపి చర్చచేయబడిన శ్రీ కృష్ణుని శరీర మెట్లుండునో, ఆకాశ మప్పు డట్లున్నదని. ఆ భావము కల్గగా అతడు బిగ్గరగా నవ్వెను.

"వాచాల!"

"వాసుదేవ!"

"దారుకుని సారథ్యమునుగురించి మాతలి నీకేమైన చెప్పెనా?"

"నాకేమి! అందరికిని చెప్పెను. అదియే నీకును చెప్పుచుండగా నీవు వానిని కోపము చేసితివి. వాడు అసలు విషయమును చెప్పకనేపోయెను."

"నీవు చెప్పుదువుగాని"

"అట్లాలనే!"

"మాతలినే పిలిపింతును."

"అట్లాలనే!"

★

# గోరంతగొప్ప

9-వ పేజీ తిరువాయి

తనదికాదు. రంగడిసొత్తు .... పుట్టినప్పుడు ఎలా పుట్టాను ?-ఆ రంగడు రమ్మంటే ఎలా పోతాను ?-నన్ను తలచుకోరా అని, పుటక యిచ్చాడు-నరులను సేవించరా,-అని,-యీ దేహం యిచ్చాడు. చాలు !-అనేవాడు. కాస్త తీరిక అయితే చాలు,-పోయి, రంగనాయకస్వామి ఆలయం ముందు కూర్చునేవాడు.

అక్కడ ఓ బసవన్న ఉండేవాడు. ఆలయం ముందు ఎప్పుడూ, గస్తీ తిరుగుతూ ఉండేవాడు. చేత యింత మిఠాయి పట్టుకెళ్లి గంగడోలు నిమురుతూ, దానికి పెట్టేవాడు రామాంజయ్య.

రామాంజయ్యకు,-ఒక్క కొడుకు. తండ్రంత కొడుకు. ఎప్పుడూ తండ్రిలాగానే నవ్వుతూ ఉండేవాడు. కోమటింట పుట్టినా, పదిమంది బ్రాహ్మణుల పెట్టుండేవాడు. పసిపిల్లలంటే తగని ప్రాణం. దారివెంబడి పోతూంటే.... ఏ యింట్లోంచన్నా, పసిపిల్ల ఏడుపు వినబడితే చాలు, గబగబ లోపలికి వెళ్లి, స్వతంత్రంగా, ఆ బిడ్డను ఎత్తుకుని, అటూ యిటూ తిప్పి పోరు మాన్పేవాడు. వాడు, చేతిలోకి తీసుకుంటే సరి,-ఎంత రాకాసి గంప్పైనా యిట్టే నవ్వేది. 'అలాగే నవ్వుతూ ఉండవే అక్కాయ్ ....' అని, ఆ బిడ్డను తల్లి చేతికి యిచ్చేవాడు. వాడికి, చిన్నగానీ, పెద్ద కాని,-ఒక్కటే వరుస. అన్నాయ్, అక్కాయ్ .... మరో పిలుపు పిలిచి ఎరుగడు.

మాఊరి బజారుకు, పక్క గ్రామాలనుంచి,-యిటు తూర్పు నుంచీ, అటు దక్షిణాన్నుంచీ కూరల కావిళ్లూ, గంపలూ తెల్లారేసరికి వచ్చేవి. ఆ మొగదలా, యీ మొగనూ,-పోలీసు జవానులు, కాచుకుని ఉండి, కూరలవాళ్లు అక్కడ చెరువు గట్టున,-చద్దన్నాలు తినేప్పుడు,-అడగడం,- వాళ్లు గంపకో కాయ ఇవ్వడం మామూలు. ఇచ్చినందువల్ల, వాళ్లకు ఏ బాధా లేదు; వాళ్లకు, వీళ్ల పోరూ లేదు. ఎంతకాలంగానో, అలానే జరుగుతూ వస్తూంది. కాని, అధికారులు, ఎల్లకాలం ఒకళ్లే ఉండరుకదా. వెనుకటి హయాంలో అయితే,-అక్కడివాళ్లకు అక్కడే నౌకరీలు కావడం,- చేసినన్నాళ్లూ చేసి, వాళ్లు అక్కడే పింఛను పుచ్చుకోవడం అంటూ ఉండేది. తెల్లారి లేస్తే, తెలిసిన మొగాలే కనుక, ఏ రొష్టూ ఉండేదికాదు. రానురాను,-ఆ పద్ధతి పోయి,-బదిలీలంటూ వచ్చి పొరుగూరి జనాభా చేరడంతో కొంచెం రద్దీ ఏర్పడ్డది. కొత్తగా వచ్చిన హేడ్డు తినమరగినవాడు. అతడి చేతిక్రింద అలాటివాళ్లే తయారయారు. కావడంతో,-కాయా కసురుకు చేజాపడం పోయి,-ధిమాకీగా,- బేడా,-పావలా నిలవేసి వసూలు చేయడం ఆరంభించారు. విసుక్కుంటూనో, నసుక్కుంటూనో వాళ్లు యిస్తూనే వచ్చారు : అంతటితోన్నా, వాళ్లు వూరుకున్నారా,-అది అలుసైై గంపకింత,-కావిడికింతా,-అంటూ, పన్ను వేయడం ప్రారంభించారు. అందుకూ వాళ్లు, నోరెత్తలేదు. మన కర్మం గావోలు అనుకున్నారు యిచ్చారు.

అలా, యివ్వడమే తప్పయింది. ఇవాళ యిచ్చుకోలేను బాబూ అంటే చేయి చేసుకోవడం ప్రారంభించారు. వాళ్లు అందుకూ పడ్డారు. మరి, మొరెట్టుకునేందుకు దిక్కేదీ ?-

కార్ఖానాకు కావలసిన పచ్చిమిరపకాయలూ, అల్లం, కొతిమిరాకూ, వతనుగా,-అక్కడికి మూడు కోసుల్లో ఉన్న ఉల్లిపాలెంనుంచి,-కాపు మనిషి ముసలయ్య పట్టుకొచ్చేవాడు. అవాళ, రాలేదు,-మర్నాడు రాలేదు, ఏమా అని,- రామాంజయ్య కొడుకు, అక్కడకు వెళ్లి చూడగా,- ముసలయ్య మొగం అంతా వాచిపోయి, పడుకుని ఉన్నాడు. వీడిని చూసి,-నా బతుకీకాడికి వచ్చింది రంగయ్యా! అని,-వలవల్లాడినాడు. నీకేం భయంలేదు, రేపు రా: నే నెదురొస్తాలే, అని చెప్పి చక్కా వచ్చాడు.

హేడ్డు స్టేషనుకు, ఓ సందు వెంబడి వస్తాడు: వీడు, అక్కడ కాచాడు. మరియాదగానే అడిగాడు. ఇదేం మరియాదయ్యా ! అని,-హేడ్డు మొండిగా జవాబు చెప్పాడు ... నోరెత్తితే, నిన్నూ 'తంతా నన్నాడు. వీడు అప్పటికీ నిదానించాడు : హేడ్డు అది చూచి రెచ్చిపోయి,-వీడి కులాన్నీ, వీడి అబ్బనీ తిట్టాడు.

వీడిక ఉండబట్టలేకపోయినాడు. పట్టుకుని, ఏకీలు కాకీలు తీసి,-బండిమీద వేసి,-మనిషిని సాయమిచ్చి, అస్పత్రికి పంపించాడు. అక్కడ, ఫలానావాడు పట్టుకు చిదగ్గొట్టాడని చెప్పడం నామోషీ అనిపించి,- ఎద్దులు తరుముకొస్తే - వంతెనమీంచి పడ్డానని,-నమోదు చేయించుకున్నాడు హేడ్డు.

రంగయ్య అక్కడనుంచి అటు పోయినాడు.

చెరువుగట్టున కావిడీ, గంపా దిగి ఉంది...జవానూ ఉన్నారు: ఒకరో యిద్దరో. వీడు, కావిడిబద్ద తిరగేశాడు. ఆ డబ్బక్కడ పెట్టించాడు. ఎర్రటోపీవా డిక్కడకు వచ్చాడో,-కోటప్పకొండ తిరణాళ్లలో గోపిరెడ్డి ఏంజేశాడో .... అదే యిక్కడా జరుగుతుం దన్నాడు. పోయి మీ హేడ్డుతో చెప్పుకోండన్నాడు.

రామాంజయ్యకు యిది తెలిసింది. 'ఛీ నీవేం మనిషివిరా .... అన్నాడు. వీడు వివరించి చెప్పాడు. 'అలనా పాలనా జేసేందుకు ఆ రంగడుండలా! మధ్దిన నీ వెవడివిరా....మూరుమనిషి...మనకు దేవుడుగాడ్రా ? నిన్నిల్లాగే పెంచాన్రా నేను ?' అన్నాడు, రామాంజయ్య. వీడు నోరెత్తలా.

జవాన్లు పోయి హేడ్డుతో మొరెట్టుకున్నారు. వీడిని ఎలాగ్గైనా, లోపలికి తోయించేయా లనుకున్నారు. శివంగ సంబరాల్లో, పారువేట ఉత్సవంలో వీడిని పట్టేయచ్చనుకున్నారు.... కాని, ఎందువల్లనో, ఎంతగాలించినా వీడక్కడ తగల్లా...యిది, పనికాదూ, అనుకొన్నారు....

ఓనాడు,, ఉదయం, రంగయ్య, రంగనాయక స్వామి ఆలయానికి పోతూండగా,— వీధిలో, ఓ అరుగుమీద,— ఓ ఆడకూతురు.... పిల్లను ఒళ్లో పెట్టుకు కూచుంది.. పిల్ల పోరెడుతూంది. రంగయ్య అక్కడకు ఉరికి బిడ్డ నందుకున్నాడు—

# గోరంతగొప్ప

రంగయ్యా...బిడ్డకు, వత్తులు ఒరుసుకుంటు న్నాయి...పట్టు బలవంతాన తీశాను. అందుకూ యీ పోరు. నీవచ్చావుగనుక కాని,—మద్దినేళదాకా... కాళ్లు చేతులా నిలిచేదికాదు.... పోతూపోతూ,— కంసాలి పైడయ్యకు యీవత్తులిచ్చి, ఓ వీసం, సొగ్గొట్ట మందూ.... మామనిపొస్తాడని చెప్పు.... అంది...

అలాగే పట్టుకు, యువతలకు రెండడుగులు వేయడం.... ఆ ఆడకూతురు వెనుకనుంచి దొంగ దొంగ!— అని అరుచుకుంటూ వీథినిపడటం.... జవాన్లువచ్చి కమ్ముకోడం.... రంగయ్యను, చేత సొత్తుతో, యీడ్చుకెళ్లడం.... రంగయ్య యింట్లో జొరబడి, తొట్టెలో బిడ్డచేతులవి ఊడబెరుక్కు పోతున్నాడని, ఆ ఆడకూతురు వాఙ్మూల మివ్వడం.... వెంటనే విచారణంటూ ఒహటి జరగడం.... రంగయ్యకు, ఆరుమాసాలు కఠినశిక్ష పడటం— ఆ యిలాకావారి నిర్వాకం గావడంతో,— నిముషంలో జరిగిపోయింది.... ఊళ్లో అందరూ,—ముక్కుమీద వేలేసుకున్నారు.. రామాంజయ్య.... రంగా! అన్నాడు:

రాజమహేంద్రవరం, తీసుకు వెళ్లేటప్పు డైనా,— తండ్రినీ బిడ్డనూ, చూసుకోనివ్వ లేదు.... యిలాకావారు:

ఆరుమాసాలూ,— గడిపి,— తిరిగి వచ్చాడు.... రంగయ్య. యింటికిరాలేదు: రంగడిగుడిలో కూర్చు న్నాడు.... ఆపూట: రామాంజయ్య కోవెలకుపోయి, కొడుకుని చూసి నవ్వాడు....నామొగం చూడగానే సీతామ్మవారంటి ఆడకూతురికి,— అబద్ధమాడా లనిపించింది.... ఇక నామొగం ఊళ్లోచూపించను. యీ బసవన్నతోపాటు,— రంగణ్ణి నమ్ముకుని యిక్కడే పడుంటా.... వాడితోబాటు,— నాకూ సంజెపూట— యింత పడేస్తుండు ...అన్నాడు :

కాని, అలా జరుగలేదు. యిలాకావారు, ఉండ నివ్వలేదు.... మళ్లీ ఏదో, మీదవేసి, అక్కడికే పంపించారు....

అలా,.... పదేళ్లు.... రావడం, మళ్లీ పోవడం..

అక్కడ,— వాళ్లుపెట్టిన తిండితో, కొట్టిన దెబ్బలతో,—మనిషి చివికిపోయినాడు.... ముప్ఫయి ఏళ్లకే.... అరవైదాటిన వృద్ధయినాడు.. అంతతో యిలాకావారికీ,— వినుగొచ్చిందేమో.... ఆపై,— వాడు భూమ్మీదున్న నాలుగేళ్లూ.... రంగయ్య జోలికి ఎవరూ రాలా?—

యీతోపుగా,— ఆహేడ్డుగారు,— మరో పొలుకు ఫించన్ పుచ్చుకుంటూ డనగా,— తలవని తలంపుగా, దారినిపోయేది తలకు చుట్టు కోవడం....ఉద్యోగం ఊడటం.... జరిగింది.... ఆహేడ్డు.... పిల్లా పాపా ఉన్నవాడు కావడంతో యిన్నాళ్లూ రెండుచేతులా పోగుచేసినా,— కావ్యాలకంటూ కరమ్మతులకంటూ ఉన్నదీ—,

# గోరంత గొప్ప

వచ్చి వాడిని తనతోడబుట్టినవాడే అన్నంత ఆపేక్షగానూ చూశాడు.

'అయ్యోయ్ ! మన రంగడేంజేశాడో నీకు ఎరుక లేదులే. ఇన్నాళ్లూ కోవిల్లో ఉన్నాడను కుంటివా ? లేడు .... నాతోనే కదిలొచ్చి, యింత కాలం నాకు తోడున్నాడు .... అన్నవేళా కంటిమీ దుండేవాడు.

ప్రజల్లో ఉంటే పదేళ్లే .... అక్కడుంటే వెయ్యేళ్ళు వాణ్ని కొలుచుకున్నట్టుండయ్యా ! వాడల్లా, పిలిస్తే పలికాడయ్యా!

నాలాటి నా అన్నలున్నారు. వాళ్లకూ తోడుండు రంగా—అని మొక్కుకున్నానయ్యా. నామాట వాడు వింటాడో వినడో, నీవు చెప్పి చూడవయ్యా .... అన్నాడు, రంగయ్య యింటికి రాగానే రామాంజయ్యతో.

'ఎక్కడుండాలో వాడికి తెలియదట్రా అయ్యాళ్ళ. వాడికి మనిషిమీద ఉండదుట్రా'' అన్నాడు రామాంజయ్య.

రంగయ్య మళ్ళీ ఎవరితో మాట్లాడలేదు. ఎప్పుడూ నవ్వుతూండేవాడు. ఎవరన్నా, ఎన్నడన్నా పలుకరిస్తే ఎగిరి గంతేసి 'రంగా!' అని పకపక లాడుతూ పరుగెత్తేవాడు.

రంగయ్యను యిలాకావారు రాజమహేంద్రం పంపిన మరుక్షణంలో బసవన్న అక్కడనుంచి లేచి పోయినాడు. చల్లబజారులో పడుకునేవాడు. ఊరంతా, ఏవాడను చూసినా తానే అన్నట్టు, తిరిగే వాడు. రంగయ్యలేని అన్నేళ్లూ అంతే.

రంగయ్య తిరిగి వచ్చాడు. యిద్దరూ కలిసి తిరిగేవారు. కలిసి రంగడి కోనేట్లో స్నానం చేసే వారు. పవలూ, రాత్రీ ఎప్పుడూ యిద్దరూ ఊరి మీదే ఉండేవారు.

అలా ఒక్క - ఆర్నెల్లు జరిగింది. రంగయ్య ఆనాటి కానాడు కృష్కించిపోతున్నాడు. రామాంజయ్య యిహ పట్టలేక ముచ్చి బసవయ్య దగ్గరకు పరిగెత్తుకువెళ్ళి వెంటబెట్టుకు వచ్చాడు. బసవయ్యంటే ధన్వంతరే.

బసవయ్య వచ్చాడు,—చూశాడు,—నవ్వాడు. 'రామాంజయ్యన్నా....రంగణ్ణే నమ్మాడు. ఆ రంగడే పిడికి ఔషధ మిస్తున్నాడు. త్వరలోనే భవరోగ విముక్తుణ్ణి చేస్తాడు' అన్నాడు. రంగయ్య, 'రంగా' అనేందుకు కూడా ఓపికలేనివాడల్లా ఎగిరి గంతేసి రంగా అని మూడు వాడలు వినబడేటట్టు పలికాడు.

మర్నాడు మామూలుగానే కోనేటికి స్నానానికి పోయినాడు. బసవన్న తోడున్నాడు. యిద్దరూ ముని గారు. బసవన్న ఒక్కడే పైకి లేచాడు. రంకెలు వేసుకుంటూ రామాంజయ్య దగ్గరకు వెళ్లాడు. ఆయనకు అర్థమయింది.

రంగయ్య ఊరేగింపుగా, ఊరు విడిచి పోతుంటే, బసవన్న వెంట నడిచి రంగా, రంగా అని

మన్నదీ అయిపోయి,— రేపెల్లాగా, అనే స్థితికి వచ్చాడు.

అసంగతి, తెలియడంతోనే,— రామాంజయ్య హెడ్డుగారింటికి వెళ్ళాడు:

పనిపోయినా,— ఖాళీచేసేందుకు, యిలాకావారు గడువియ్యబట్టి, హెడ్డు, ఇంకా ఉన్న ఇంట్లోనే ఉంటున్నాడు:

రామాంజయ్యను చూశాడు: ఎగతాళి చేయడానికి, వచ్చాడేమో ననుకుని, తాట్రపమాణం లేచాడు:

ఆయన తొణకలేదు, బెణకలేదు: ఆమంచంమీద, హెడ్డుగారి పక్కనే కూర్చుని,— అయ్యా! వెంకటప్పయ్యా! మీమీద నాకుకోపంలేదు.... గెలి చెయ్య రాలేదు: నాబిడ్డ బాగోగులు,—అరంగడివి... నీవుమటుకు ఏంజేశావ్.... భద్రాద్రి రామదాసటు.... మా, రంగయ్యటూ మనిషికి మనిషి మేలుచేస్తాడుకాని,— కీడుచేస్తాడా—! అలా అనుకుంటే తప్పుకాదా?...... ఆ నౌకరీ, యింత కాలం చేశావ్.....యింకెంతకాలం?......మానుకోడం మంచిదే అయింది....నాకూ మనిషి అవసరం ఉంది: ఆకాఖానా నీవు జూసుకుంటానని చేతులో చెయ్యేస్తే ....నాకా చింత వదలిపోయి.... హాయిగా గుళ్లో కూర్చుంటాను. నాకీసాయం చేసిపెడుదూ!— అన్నాడు :

వెంకటప్పయ్య .... శీతజ్వరం పీడిస్తున్నవాడికి మల్లే వణికిపోయి .... నీ కొడుకు నాకు బుద్ధి చెప్పాడు నేను కచ్చకట్టాను. రంగయ్య బతుకలా చేశాను నీవు కాదన్నా, అదంతే. కనుకనే నా గతి యిలా అయింది. కావల్సిందే.

ఇంట కాచిపోసే దిక్కు లేదు. వీ డొక్క డున్నాడు. పింఛ నుచ్చుకుని ఏ కూతురి దగ్గరో పోయుందా మనుకున్నా..... యిప్పుడు ఎలా పోను. కూతురు మనదైతే, అల్లుడు మనవాడా. డిస్మిసై వచ్చి మామ తన నెత్తి కెక్కితే.... ఆదరిస్తాడా?

పోనీ, పిల్లవాణ్ణి పంపేద్దామా అంటే వీణ్ణి మటుకూ తిన్నగా చూస్తారని నమ్మకం ఏమిటి?

నేనూ, వీడూ ఏంకావాలా అని అదే దిగులు.

ఇహ నాకేం దిగులూ లేదు.

నా బిడ్డను నీ కప్పగిస్తా. పెంచి పెద్దవాణ్ణి చెయ్ నా బుద్ధులు రాకుండా చెయ్. రామాంజయ్యా నీకు నీ కొడుకును కాకుండా చేశాను. అయినా— నీవు దేవుడంటివాడివి..... గనుక నా బిడ్డను బాగు చేస్తావు!—

నే నంటావా .... నలుగురిలో ఎలా తల ఎత్తుకు తిరగమంటావ్!

నా పాపం నాకు తెలియదా? ఏ కాశో పోతాను.

నన్ను పోనీయ్ .... అని బ్రతిమాలుకుని, బిడ్డ నప్పగించి తనదారి తాను చూసుకున్నాడు వెంకటప్పయ్య.

రామాంజయ్య .... అప్పయ్య కొడుకును, తన కొడుకులాగానే చూసుకున్నాడు. రంగయ్య విడుదలై

# ఆంధ్రసచిత్రవారపత్రిక

# దీపావళి కథల పోటీ

## మొదటి బహుమతి రు. 600
## రెండవ బహుమతి రు. 350
## మూడవ బహుమతి రు. 250

ఎప్పటివలె 1962 దీపావళికి కథలపోటీ నిర్వహింప నిశ్చయించాము. రచయితలు కూడా ఎప్పటివలె మాతో సహకరించి ఈ పోటీ జయప్రదం చెయ్యగోరుతాము.

**నిబంధనలు**

- కథలు స్వంత రచనలై ఉండాలి. అనువాదాలు పంపరాదు.
- కవరుపైన "దీపావళి కథల పోటీకి" అని స్పష్టంగా వ్రాయాలి.
- రచనలు తిప్పి పంపగోరువారు తగుమాత్రం పోస్టేజీ కల కవరు జతపరచాలి.
- కథ ఇరవై అరఠావు పేజీలు మించరాదు.
- కాగితానికి ఒకవైపుననే వ్రాయాలి.
- పోటీలో బహుమతి పొందని కొన్ని కథలను విడిగా ప్రచురించవచ్చు.
- వ్రాతప్రతులు 31-8-62 లోగా మా కార్యాలయం చేరాలి.
- పోటీలో తుది నిర్ణయాలు సంపాదకులవే. ఈ విషయమై ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు.

ఒంకెలు వేసుకుంటూ సాగనంపేడు.

బసవన్నకు ఆనాటినుంచీ ముసలితనం వచ్చింది. రామలింగేశ్వర ఆలయం ముందు, గడ్డిమోపులవాళ్ళు వస్తూ, వస్తూ ముందో పన్నెండు పరకలు వేసి వెళ్ళేవారు. అవన్నీ ఒక మేటి అయేది. తినేందుకు చుట్టూ మేకలు జేరేవి.... బసవన్నతో ఆడుకునేవి.

సర్వసాధారణంగా మా ఊరి పెద్దలు, దేశం తిరిగి వచ్చి అక్కడ ఎన్నడో ఒకనాడు బహిరంగ సభ చేసేవారు. వారి వెంట ఉండే అనుయాయి గణం ఓ పదో, పరకో,—తప్పనిసరిగా వారూ,—బల్లా, కుర్చీ తెచ్చి వేసిన కూలీవాడూ, దీపాలు మోసు కొచ్చినవాళ్ళూ పోను .... అన్నేళ్ళూ అన్ని ఉపన్యాసాలూ శ్రద్ధగా ఆలకించింది... బసవన్న ఒక్కడే! స్వరాజ్యం వచ్చేముందే వారూ కైవల్యానికి పోయి నారు.

రంగయ్యకు భవబంధ విమోచనం ప్రాపించిన మరునాడే రామాంజయ్య కార్ఖానా పనివాళ్లకు పంచిపెట్టి వెంకటప్పయ్య కుమారుణ్ణి వాళ్లకు అప్పగింతపెట్టి, కార్ఖానా అంటిపెట్టుకున్న కొబ్బరితోటలో తగుపాటి చెరువు తవ్వించి, రంగడి విగ్రహం ముందుంచుకుని, అక్కడే ఉండేవాడు. రామాంజయ్య మరి మిరాయి చెయ్యలేదు... ఎవ రికీ పెట్టాలేదు.

కాని, గ్రామంలో పిల్లలకు, ఆ కొరత లేకుండా తలారివారి చిన్నవాడు... వెన్నవంటి మిసమిస మిస వాడు... రంగయ్య లాగనే నవ్వేవాడు. గాలిలో గుప్పిట పట్టి నవ్వులూ, నాట్యాలూ చేస్తూ వెంట పడిన పిల్లలకు, తలో పన్నెడూ పటికబెల్లం ముక్క లిచ్చేవాడు...వాడు,—అరంగదాసు చిందులువేసిన చోట మోపెడు మల్లెపూలు రాలేవి... వాడు, శుక్లపక్షంలో వెన్నె లున్నట్టు ఉన్నాడు. వెన్నెలంత నవ్వు వెద జల్లాడు. అంతులేని ఆనందం అందరికీ మౌనంగా యిచ్చాడు. చంద్రరేఖల్లే అనంతాన కలిసి పోయి శాశ్వతుడైనాడు. వాడి పుణ్యాన మా గ్రామానికి యిప్పటికీ మల్లెలు పుష్కలం ! మరి ఆ ఆనందం, అది, వాడి ఒక్కడి సొమ్మే !

కేవలం ఆ ఒక్కడి సొమ్మే కాదు, మరో దూదే కుల సాయెబు యిస్మాయిల్—కు వారసత్వం వచ్చింది.

వాడు నిత్యమూ బైర్—బత్ బుజాన వేసుకుని ఆ వీథినే పోతుండేవాడు. కట్టు పొగరుబోతని ప్రతీతి. తనకంటికి ఆ యిల్లు నచ్చితేనే అడుగు పెట్టేవాడు. పరుపో దిండో కుట్టేవాడు. లేదో పిలి చిన ఆసామిని పట్టుకుని, పరుపామీదా పడుక్కుం టావ్—వాట్కి పర్వా ఉడాయిస్తుందిగాదూ వయ్యా... సాపమీద పడ్కో అనేశేవాడు. ఒక సాపు, గోపాలదాసుగారు, అంటే పుట్నూరి గోపాలదాసుగారు, ఆలయంలోనుంచి వీథిమీదికి

'ఆంధ్రసచిత్ర వారపత్రిక'లో ప్రచురణకు ఇండియన్ ఇంక్ తో వేసిన కార్టూనులు మాత్రమే పంపాలి. సాధారణంగా 4"×2", 4"×4" చిత్రాలు ప్రతి కలో పడుతూ ఉంటాయి.



# గోరంత గొప్ప

రావడం,— వీడలే రావడం జరిగింది. వీరు వాడివంక చూశారు—బహు ఆరాగా, వీడు మామూలు నిర్లక్ష్యంతో ఓకన్నటు పారేసి,— ఏమండీ పెద్దవారూ...మీకూ పర్సూ కావాలా! అన్నాడు.

'నాకు పరుపెందుకు సాయేబూ. ఉన్న బలుపు చాలదూ అన్నారు వారు. యింతబందోబస్తీ మీద ఉండి సాపమీద పడ్కుంటూరా?—'

నాకు, ఆచాపమటుకెందుకూ, యీ నేలచాలదూ!

అదేమివయ్యా... మీకీ, సాప ఖరీద్ సేసేదానిక్ పైసాలేదా?

'లేకేం కావలసినంతఉంది. అదుగో నా ఖజానా...' అని ఆలయంలో స్వామిని చూపించారు.

'అక్డ బిఠాయించినావార్కి మీరూ గుళామిలా?'

'వారి గులాములకు గులామును... అవును నాయనా నామాట నమ్మకపోతే అదిగో చూడు, వాడినే, అడుగు నిజం చెబుతాడు.....'

యిస్మాయిల్ భుజంమీద చేయివేసి గోపాలదాసుగారు వాడికి గోపాలస్వామిని చూపించారు. మౌనంగానే ఉపదేశం చేశారు.

అంతే వాడు భుజాన ఉన్నవి అక్కడే జారవిడిచినాడు. పోయి ఆ ఆలయం అరుగుమీద కూర్చున్నాడు. తలవంచుకుని ఏడు రోజులున్నాడు. ఎనిమిదోనాడు ఉదయం, గోపాలదాసుగారు దయచేసి, వీడిని చూసి, బిగ్గరగా నవ్వుకుంటూ స్వామికి అక్కడనుండే నమస్కరించి దారినిపోయినారు.

ఆనవ్వులో, యిస్మాయిల్, కదిలినాడు. అక్కడనుంచి లేచాడు. అక్షరంరానివాడు, అలా తలవంచుకుని నడుస్తూంటే వాడు పాడే పాటలు వినేందుకు ఎందరో వెంట ఉండేవారు. ఆపాటలు యీనాటికీ మాగ్రామంవారు పాడుకుంటూ ఉంటారు.నడుస్తూ నడుస్తూ ఏయింటిముందో ఆగేవాడు. యింటి యిల్లాలు ఒక్కముద్ద దోసిలిలోవేస్తే అది అక్కడే తినేవాడు. తిన్నగాపోయి బందరుకాలువ పాయఒడ్డున కూర్చునేవాడు.

వారిపాట విన్నవారందరూ, భక్తులైనారు... వెంట తిరిగినవారు వేత్తలైనారు,—ఏటేటా వారి పేరున ఉత్సవాలు, మాగ్రామంలో జరుగుతూనే ఉంటవి.

అలాటివాడు కాడు, అంతవాడు కాడు, కోమటి సుబ్బయ్య. పాతకలాటివాడు, బొంగురుగొంతువాడు, గంటకో మాట మాట్లాడేవాడు. ఒంటెడు నామాలవాడు,మోపెడు తులసిపూసలవాడు. రామాంజయ్య శార్ఖానాలో, చిన్నప్పటినుంచీ పనిచేసినవాడు రామా! అని మట్టుకు స్పష్టంగా ఉచ్చరించగలిగినవాడు!

చిన్నదుకాణం, పెద్దఎత్తున అమ్మకం...రాత్రి పదింటికి సాధువులందరూ చేరేవారు గోడకానుకుని కూర్చుని ఆ తత్వాలన్నీ ఆనందంగా ఆలకించేవాడు. పదకొండుకాగానే చుట్టుప్రక్కల తిరుతూన్న, గోవులన్నీ వచ్చేవి. పెద్దపళ్లెము నిండుగా అప్పుడువండి చల్లార్చిన సరుకు పట్టువచ్చి బహుశ్రద్ధగా వాటికి ఆరగింపుచేసేవాడు నీరు పట్టేవాడు. పోయిరండే తల్లుల్లారా! యివేఏంపెట్టానో, ఏంతిన్నారో రేపేలోపం రానీయకండమ్మా' అని మొక్కేవాడు. చేరిన సాధువులు తుష్టిగా వడ్డించేవాడు. తలోయింత ముట్టచెప్పేవాడు. అమ్మిన అమ్మకంలో మర్నాడు కొనేగోలుకూ, రోజువారీ జీతాలకూ, యీ ధర్మాలకు పోను, మిగిలింది రొండిన పెట్టుకుని తిన్నగా ఓమైలు నడిచి ఏ అర్ధరాత్రికో యింటికి చేరకునేవాడు.

యిల్లుఅంటే తనది కాదు తోబుట్టువుది తనకు తానొక్కడే. అక్కడే స్నానంచేసి, ఉదయమే వచ్చి కన్యకాపరమేశ్వరికి నిన్న మిగిలినసొమ్ము సమర్పించి, వచ్చి వ్యాపారం చేసుకునేవాడు...గోవులకూ గోసాయిలకూ యిప్పటికీ అలా సాగించేవారున్నారా? ఔనంటే అది అబద్ధం.

—యీ బ్రతుకు అబద్ధం అనుకుంది, అలతనవారితో అనేసింది, వాడలో పుట్టిన ఒకచిన్నది.

చిన్నదానితల్లి, జమీందారుల ప్రాపకాన వుండి బిడ్డలకు మొగంవాచిపోయింది. ఎవరో ఒకసాధువొచ్చి విభూతిచ్చి మగపిల్లాడా, ఆడకూతురా? అనగా—మొగపిల్లకోసంజేసుకోను? ఆడపిల్లయితే— అక్కరకొస్తుంది. అన్నదట! మొగపిల్లడైతే నీకక్కరకువచ్చేవాడు, ఆడకూతురు కలుగుతుంది. అది నీకు అందకుండా బోతుంది, అన్నాడు సాధువు. అంటే ఏమహారాజుల కటాక్షమో ప్రసరించగా తనకందని పాయాకు పోతుందనుకుందాతల్లి.

పిల్లకు యీడొచ్చింది. ఒకరిద్దరు ఘరానావాళ్ళువచ్చారు. రానిచ్చింది. ఏమిబోధ చేసేదోకాని ఒక్కక్షణంలో యువతలకు వచ్చి ఆ తల్లిముందు చెంపలేసుకుని, 'మేము అపచారంచేశాము. ఆమె మహాయోగిని!' అన్నారు. ఆతల్లితోబాటు ఆవాడా, ఆ వాడతోబాటు ఊరూ, అప్పుడు కన్ను దెరిచింది. జ్ఞానమాంబను గౌరవించింది. బెజవాడ కనకదుర్గ తననీడను, ఆజన్మకు సాఫల్యమిచ్చింది.

చిత్తగించారు.... మాగ్రామం చరిత్రతో జోరబడవలసిన అగత్యం లేదు... ఈ గోరంతగొప్పే.. మాకు ఎల్లకాలం చాలును !



# కొత్త నుడికట్టు-2

## అడ్డం

1. సముద్రంలోనూ, నగలలోనూ దొరుకుతుంది కాని, ఎటునుంచి చదివినా ఒకటే.
3. కొంనుచివర తపస్సుచేస్తే దొరికేది.
5. నామాట సామెత కాని కలగాపులగం అయిపోయింది.
6. వాసన.
7. ఇవి చెప్తే వింటాయి!
9. వెల్లవేసేదానిలో పూజ్యమా?
11. దిండు.
13. విధేయత.
14. 11 అడ్డంవంటిదే.
15. ముదిరిన.
17. ఆపి, ని చేరిస్తే స్త్రీ.
19. కృష్ణుడు చంపిన ఆడరాక్షసి తల్లక్రిందులయింది!
21. నల్లకోటు తొడిగే మనిషి.
22. 18 నిలువుకూడా ఇదే.

## నిలువు

1. అలంకరణ.
2. మునుపు మొదటకూడా అదే!
3. —నవ్వడి, అంటారు.
4. ఈ పుస్తకం, ఆ కలం; ప్రతిఒక్కటీ ఇదే.
6. గౌరవింపదగినది.
8. గిరీశం అన్న!
10. సోదరుడు తల్లక్రిందులయ్యాడు.
12. భుజాలమధ్య ఉండేదా? (క్రిందనుంచి చదవండి!)
16. విదియవంటిదే!
18. నిజము.
19. పారేది.
20. హారంలో గుచ్చేదేనా?

★

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ■ | 1 | | 2 | ■ | 3 | | 4 | |
| ■ | | ■ | 5 | | | ■ | | ■ |
| 6 | | | ■ | ■ | ■ | 7 | | 8 |
| | ■ | ■ | ■ | 9 | 10 | ■ | ■ | |
| 11 | | | 12 | ■ | 13 | | | |
| | ■ | ■ | 14 | | ■ | ■ | ■ | |
| 15 | 16 | | ■ | ■ | ■ | 17 | 18 | |
| ■ | | ■ | 19 | | 20 | ■ | | ■ |
| 21 | | | | ■ | 22 | | | ■ |

## సరాగమాల

10-వ పేజీ తరువాయి

న్నిచ్చినవి. పరిస్థితుల ప్రభావంవలన ఏ దారీ గానక వల్లనివాడిని మెల్లన వేడుకొంటున్న పాట యిది. సదాశివబ్రహ్మంగారి రచన యెంత హృద్యమంగా ఉందో తెలుసుకోవటానికి "ఇల్లాలినైతి యెదురాడ నైతి" అన్న మాటలు చాలు.

"కృష్ణా" అన్న పలుకులో అంత విచారాన్ని పొదిపి పెట్టడం సుశీలకే తెలుసు.

ఈపాట వెంటనున్నది "మనలో మాట సుమా విను మనసార కోరేది నేనే సుమా" అంటూ ఒకసారి విన్నంతనే స్వప్నసీమల్లోకి వెంటాడే సుశీల పాడిన ఖవాలి. "గులాబి మోవిలోని తీయదనం" ఆరుద్ర సాహిత్యంలోనూ ఉంది. సుశీల కంఠానా ఉంది. పల్లవిపల్లవికీ పలికే తబలా దరువులు ప్రేమనుబడిన పడుచుగుండె; పరుగులు; హార్మోనియం వంపులు సొగసులాడి నాట్యపు వంపులు; సితార్ సుతారపు శ్రుతులు విరహంవలన కలిగే కమ్మని వెతలు. పాట ఒకసారి వింటేచాలు విరహం లోని మాధుర్యం, ప్రియ సాన్నిధ్యంలోని ఆహ్లాదం తెలియనివారికీ తెలుస్తాయి.

**పదండి ముందుకు జి. ఇ. 35268**

మరొక మధురమైన ఖవాలి జానకి పైచిత్రం లోన పాడినది. వినాలని ఉందా? "ఇన్నాళ్ళ లేని వేగిరపాటు యిపు డేలరా" అని జానకే ప్రశ్నిస్తుంది. "మునినవ్వు వెలుగులోనా కొనచూపు నీడలోనా చెమరింపు సైపలేని చినదానరా" అని ప్రతి స్త్రీహృదయం తను వలచి పిలచిన ప్రియునిదగ్గర పాడాలనుకుంటుంది. "నీతోడు లేనినాడు నిదురే రాదురా పాన్పుపై మల్లెలన్ని పల్లేరు లాయెరా" అవును మరి. ఆ వేడి కౌగిలింత కలవడిన ప్రాణానికి మరి ఒంటరి సుఖమేది! నెలాఖరుకి తిరిగి వస్తానని చెప్పి మాటే మరచిన మగవానితో యింకే మనాలి? పల్లేరులైనా గుచ్చుకుంటే వెంటనే తీసి పారవేయవచ్చు. మల్లెలను తీసివేసినా ఆ పరిమళం మనస్సులో దాగి ఆ లేనివాడిని జ్ఞాపకంచేసి పరిపరి విధాలా వేధించదా! "కనుపాపనీడలోన నిన్నే దాచుకున్నదాన" అని చెప్పినా వినడాయెను మరి. "కలలోన నిన్ను చూచి అలవోలె పైకిలేచి కవ్వించ చేరగావే కరిగిపోయేవురా" పాపం కలలో కలిసే సుఖముకూడ నోచలేదు. "ఈ వంగనాచితనము యిక నే నోపనురా" అని హెచ్చరించడమే మిగిలినది. ఈ పాట పాడిన కంఠం జానకిది కాదు. "కలత బరువుతో కలవరాలతో కనుదోయి మూయని" కన్నెపడుచుది. సాహిత్యం నారాయణరెడ్డిది. సంగీతం కోదండపాణిది.

రెండవ ప్రక్కనున్న పాట మన తెలుగుసినిమాలలో వినపడిన మొదటి భాంగ్రాపాట. ఈ భాంగ్రా పంజాబుదేశంలో పంటకోతలైనతరువాత మగవారు ఆడుతూ పాడే బృందగీతం. ఇటువంటివి హిందీలో చాలా వచ్చినవి. కాని ఈ పాట దేని అనుకరణా కాదు. కాని పంజాబీ మాతృకలో ఉన్న వూపూ వడీ రెండూ ఉన్నవి. 'నీ చేయి, నా చేయి కలవాలి, నేను నీలోన లోలోన ఒరగాలి వరని మేనులు పొంగాలి" అని ఉంది ఆరుద్ర సాహిత్యం.

# యువ ప్రపంచం

## సర్టిఫికెట్ల బెడద

నేటి యువక విద్యార్థులు ఎదుర్కొనే ముఖ్యమయిన సమస్యపై చదువులలో సీటు సంపాదించటం. అసలు అప్లికేషను ఫారము విద్యార్థికి చేరడానికే ఒకతంతు. ఆ తర్వాత దానిని పూర్తిచేసి పంపడానికి మరో పెద్దతంతు. "పూర్తి పేరు, వయస్సు..." వగైరాలన్నీ సులువుగా నింపినా "నేటివిటీ సర్టిఫికెట్" మొదలైనవాటిదగ్గర వస్తుంది తగువు. ఈ "నేటివిటీ సర్టిఫికేటు" తాసిల్దారు ఇవ్వాలిట. తాసీల్దారు గారు, ముందుగా మునసబు "వీడు ఫలానావాడు. ఇక్కడ వాడే... ఫరవాలేదు" అని ధృవపరిస్తేగాని, ఆ సర్టిఫికేటు యివ్వరు. మునసబుగారిచేత ఆ పైమాట వ్రాయించుకొనిరావడానికి రెండుసార్లు ఆయన యింటికి తిరిగి, కాస్త ముట్టజెప్తే వెంటనే (పాపం) వ్రాసియిస్తారు. ఒకే విద్యార్థి రెండు మూడు కోర్సులకు ఎప్లైచేస్తే ఒక్కొక్క కోర్సుకి ఒక్కొక్క "నేటివిటీ సర్టిఫికెట్" ప్రొడ్యూస్ చేయాలి గనుక, దేనికదే వేరేగా డబ్బు పుచ్చుకుంటారు. (మునసబులందరూ యింతే అని కాదు నా ఉద్దేశ్యము.)

ఈ సర్టిఫికెట్ల విషయంలో గవర్నమెంటువారి ఉద్దేశ్యం ఏదైతేనేం, ఇది కేవలం విద్యార్థులను లంచాలిమ్మని పరోక్షంగా బలవంతం పెడుతున్నట్లుగానే ఉంది.

పైన వ్రాసినదంతా కల్పించి వ్రాసిందికాదు. అనుభవించి వ్రాసిన నిజం. యువక విద్యార్థులు నాతో తప్పక ఏకీభవిస్తారని నమ్మకం. ఎందుచేతనంటే పైన చెప్పిన బాధంతా ఎప్పుడో ఒకప్పుడు ప్రతి విద్యార్థి అనుభవించి తీరవలసినదే.

గుండాల నరసింహాస్వామి (విశాఖపట్టణం)



కూటికి పాటు

చిత్రకారుడు : వి. ఎన్. స్వామి, (వడద(

# పొట్టికథలు

### అతనికంటె ఘనుడు!

ఇద్దరు ఉద్యోగులు కంపెనీ యజమాని ఇంటికి విందుకెళ్లారు. భోజనాలు జరుగుతున్నాయి; యజమాని ఏవేవో కబుర్లు చెబుతున్నాడు. రానురాను ఆయన ప్రసంగం ఉద్యోగులను ఇరకాటంలో పెట్టింది.

'మీకు ఓమర్ ఖయ్యామ్ ఇష్టమేనా?' వారి సాహిత్యాభిరుచి ఏపాటిదో తెలుసుకునే ప్రయత్నంలో యజమాని ఒకరిని అడిగాడు.

"ఇష్టమా! పడిచస్తానంటే నమ్మండి. కాని ఏ మాట కామాటే చెప్పుకోవాలి. నాకు జిలేబీ అంతకంటే ఎక్కువ ఇష్టం. ఆ ప్రబుద్ధుడు సమాధానం చెప్పాడు.

యజమాని తెల్లబోయి అంతటితో తన ప్రయత్నం మానుకున్నాడు. విందు పూర్తి అయింది. ఉద్యోగు లిద్దరూ ఇళ్ళకు తిరిగి వెడుతున్నారు.

"ఒరేయ్! నీకు తెలియని దాన్ని గూర్చి అడిగినప్పుడు తెలియదని చెప్పక, ఎందుకురా కోస్తావ్. ఓమర్ ఖయ్యామ్ అంటే మిఠాయి కాదురా! అది ఒక రకం పానీయం." రెండోవాడు తన మిత్రుణ్ణి మందలించాడు.

కుమారి సరళ (చీరాల)

* * *

### సహకారం

ఒక పేద గుమాస్తా ఇంటికి కన్నంవేసి, దొంగ లోపలికి ప్రవేశించాడు. అలికిడికి గుమాస్తా మేల్కొన్నాడు.

"అడుగు ముందుకు వేశావా చచ్చావే. నీ డబ్బు ఎక్కడుందో నన్నే వెతుక్కోనీ. దొంగ కత్తితో బెదరిస్తూ, కటువుగా అన్నాడు.

"ఓస్ అంతేకదా! దీపం వెలిగించనీ. ఇద్దరం కలిసి వెతుకుదాం" గుమాస్తా నవ్వుతూ సమాధానం చెప్పాడు.

రంగారెడ్డి, (చోడవరం)








Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press 6 & 7 Thambuchetty Street Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

# అత్యున్నతమైన
# ఫ్రెంచి కాఫీ




ప్రత్యేకముగా రుచి ఎంచువారలకు సరిపడునట్లుగా బ్లెండు చేయబడి, అప్పటికప్పుడు గింజలను వేయించి పొడి చేయబడి, సువాసన వెలికి పోకుండ ఉండులాగున, బ్రూక్ బాండ్ కేఫే బ్రాండు ఫ్రెంచి కాఫీ సెలోఫేన్ సంచులలో మీకందజేయబడుతున్నది. శ్రేష్ఠమయిన చక్కటి రుచికల్గిన ఫ్రెంచి కాఫీ కావలెనంటే, బ్రూక్ బాండ్ మీదే ఆధారపడండి. మీరు కొనుటకు అత్యంత శ్రేష్ఠమయినది ఇది ఒక్కటే.

## బ్రూక్ బాండ్
## కేఫే బ్రాండ్ ఫ్రెంచి కాఫీ!